ఆంధ్రవిజ్ఞానసమితి. నెం 6 రు.

# కూర్మనాథకవి కృతులు.

## మృత్యుంజయవిలాసము,

ప్రథమసంపుటము.



ప్రకాశకులు:
ఆంధ్రవిజ్ఞానసమితి,
విజయనగరము.

సర్వస్వామ్యసంకలితము.

వెల ౧-౦-౦.

శ్రీ వేపకొమ్మ గురువేంకటసుబ్బయ్యగారు,

బి. ఇ., సి. ఇ, యం. ఐ. ఇ.,

అధ్యక్షులు.

ప్రథమముద్రణము:
వృష చైత్రారంభము,
1941.

కాకినాడముద్రాక్షరశాల,
కాకినాడ.

# విజ్ఞప్తి.

గీ. ముక్తిరమణీమణీ నవామోదవ త్క
టాక్షవిన్యాస జన్యాసదృక్ష నిత్య
విభ్రమానంద(?) భ్రమసౌఖ్య విశ్వేశఘటన
పటుతరోద్యుక్తి యమ్మహానటునిభక్తి.

శ్రీ సోమేశుని కృపావలోకనమున మా ఆంధ్రవిజ్ఞాన సమితికి ద్వితీయవత్సరము ప్రవేశించినది. సమితి బాలిక జనించ గనే రాధామాధవులు, ప్రేమతో నుగ్గుపాలుపోసిరి. పదునైదు గురు విస్మృతకళింగాంధ్రవిద్వత్కవులు తమ గోత్రనామాదు లతో నాశీర్వదించిరి. తంజాపురి రఘునాథభూపాలుడు, ఆది కవి వాల్మీకికథను వినిపించెను. గార్హస్థ్యధర్మశాస్త్రమును ధర్మజ్ఞుఁ డుపదేశించెను. రేకపల్లి సోమనాథకవి గావించిన రుక్మి వతీపరిణయమును కన్నులకరువుదీర చూచినది. ఈ వత్సరాదిని మృత్యుంజయవిలాసమును మొట్టమొదట చేపట్టినది.

ప్రపంచమున మానవుఁడు యిష్టార్థమును పొందుటకు కర్మ, భక్తి, జ్ఞానములు ముఖ్యములు. మానవునిమనోరథసిద్ధి మొట్టమొదట కర్మపై యాధారపడియుండును. కర్మను చేయు చు, భక్తిప్రపత్తిని విడనాడకుండ, జ్ఞానికావలయును. భక్తి కర్మజ్ఞానములకు మేరువువంటిది. భక్తిమూలముననే పార్వతి పరమేశుని యర్ధాంగియయ్యెను.

ఈ మృత్యుంజయవిలాసమును రచించిన గోకులపాటి కూర్మనాథకవి శ్రీ కళింగ విజయనగరసంస్థానదేవస్థానోద్యోగి

మై, తనకు తీరకగల కాలమ సంతయు వృధసేయక, కృతులను రచించి దేవతాంకితము గావించియున్నాడు. ఈతడు యీ మృత్యుంజయవిలాస మను శైవయక్షగానమును, లక్ష్మీనారాయణసంవాదము, సింహాద్రినారసింహాశతకము, మున్నగు వైష్ణవ కృతులనురచించి, విష్ణుభక్తుడయ్యును శివకేశవులయందు తమ సమత్వమును చూపియున్నాడు. కాని, భక్తిప్రపత్తియందు తమయిష్టదైవమగు నారాయణుని యీగ్రంథాంతరమున నచ్చటచ్చట సంస్మరించెను.

ఈయక్షగానమున కాత్యాయనిచెలికత్తెలు మాయావటువుని యల్లరచేయగ, వరుడగు హరుడు ప్రత్యక్షమయిన ఘట్టమును చాల సొంపుగ కవి యీక్రిందువిధమున వర్ణించెను.

సీ. కటిసూత్ర మేపాటి గట్టిబాపడ! యని
దెబ్బునమొలత్రాడు ద్రెంచెనొకతె
యంబెమాచెలి తానమాడుమంచు ఘటంబు
వంచి నీర్తల ద్రిమ్మరించె నొకతె
యసగావుపెండ్లికి యెదిగింతునని పిల్ల
శిఖలాగి మిన్నందజేసె నొకతె
పులిభయంబిచట పోపొమ్మని హుమ్మని
పులితోలుపై వైచి బూదవె నొకతె
అట్టి యసమానవృత్తి సత్యప్రసిద్ధి
గనగ, గగనాంబరుండు, గంగాధరుండు

వ్యోమకేశుండు, వ్యాఘ్రచర్మోజ్జ్వలుండు
నగుచు, నగుచు హరుండు ప్రత్యక్షమయ్యె.

ఈకూర్మనాథకవి యాంధ్రగీర్వాణములయం దసమాన పాండిత్యమును, అనర్గళకవితాధారను సంగీతమున మేళవింప జేసి, సంగీతసుధారసమును యీవిలాసమున ప్రవహింప జేసెను.

ఆంధ్రవాఙ్మయప్రపంచమున పద్యరచనము సముద్భూతముగాకపూర్వము సాహిత్యము ద్విపదలయందు, రగడలయందు, మంజరులయందు, గేయములయందు, యక్షగానములయందు తాండవించినది. అట్టి ప్రాచీనసాహిత్యము రసభరితమై యాంధ్రమున వెలసినది. యక్షగానములు రానురాను నామావశేషములయ్యెను. నిజమైన సాహిత్యము, సాహిత్యసౌందర్యము, సౌందర్యపునిగ్గు, మనకు యక్షగానములయందే కానుపించును. రసభరితములగు యక్షగానముల నుద్ధరించి యాంధ్రదేశమున సరళ ప్రచారముగావించి, బాలబాలికలకు విద్యతోపాటు సాహిత్యసంగీత సంగతమగు యక్షగానములను, విద్యాలయములయందు, విశ్వవిద్యాలయములయందు పాఠ్యగ్రంథములుగ నేర్పరచి యాంధ్రసంగీతసాహిత్యకళలను పోషింపజేయవలసిన బాధ్యత విద్యాధికారులపై యున్నదని భావించెదము.

శ్రీ కూర్మనాథ కవి, గౌరీకల్యాణము, కుమారోదయములను గ్రంథాంతమున సంక్షేపించి ముచ్చటగ మూడు వాక్యములలో విరచించి, 'మంగళాంతాని కావ్యాని' యను నుడిని సార్థకపరచెను.

బాలేందుధారియుఁ బార్వతిగూడి
చాల మోదంబున సౌఖ్యంబుజెంద
నొనర సంతటఁ గుమారోదయమయ్యె
ఘనతారకాలి రాక్షసవధమయ్యె
సకలలోకమ్ములు సంతోషమందె
ప్రకటకల్యాణ పారంపర్యముగను.

మాకులభించిన తాళపత్రమాతృకలు, ప్రాచీన ముద్రిత ప్రతియు, మిక్కిలి దోషభూయిష్ఠములై, పఠనానర్హములై యుండినందునను, సత్వరముగ ముద్రణభాగ్యమును పొందించుటకు ప్రయత్నించుటచేతను, నియ్యది నిర్దుష్టముగ నుండకపోవచ్చును. నామమాత్రావశిష్టమై విద్వత్కవులకుకూడ తెలియకుండ మూలపడియున్నట్టియు, తప్పులకుప్పలై యున్నట్టిప్రతుల ననుసరించి, యీరూపమునైనను పొందించి, యాంధ్రికి సమర్పించగలిగినామని సంతోషించుచున్నారము. పునర్ముద్రణావకాశము త్వరలో గలిగినయెడల నిర్దుష్టముగ చక్కగ ముద్రించి, యొసంగ గలము. ఈమహాకవి జీవితచరిత్రాంశములు, మా "ఆంధ్ర విజ్ఞానసమితి" ద్వితీయగ్రంథరాజమగు విస్మృతకళింగాంధ్రకవుల చరిత్రమున విపులీకరించియున్నందున నిచ్చట ముచ్చటించలేదు.

# కృతజ్ఞత.

కళింగ విజయనగర ప్రభువులును, అభినవ విద్యాభోజులును అగు శ్రీ శ్రీ శ్రీ ఆనందగజపతి మహారాజమన్నె సుల్తాన్ బహద్దూరువారిచే యొసంగబడిన "మహాజన్" బిరుద విభ్రాజితులును, రావుసాహెబు బిరుదాంకితులును, వణిక్శిఖామణులును (Merchant prince) అగు కీ. శే. శ్రీ పేర్ల రామమూర్తి శ్రేష్ఠిగారి ధర్మపత్ని, నిరతాన్నప్రదాత్రి, పేరుమహమ్మద్‌పుర యెస్టేటు జమీందారిణియగు శ్రీ అన్నపూర్ణమ్మగారు, భాషోద్ధరణకై, మా ఆంధ్రవిజ్ఞానసమితి ద్వితీయవత్సర ప్రథమప్రచురణమగు "మృత్యుంజయవిలాస" మను యక్షగాన ప్రబంధమునకయిన ముద్రణవ్యయమును సర్వము నొసంగి, భాషాసేవకు తోడ్పడినందుల కెంతయు కృతజ్ఞులము.

శ్రీ అన్నపూర్ణమ్మగారి దాతృత్వమునకు, భాషాపోషణమునకు, పరోపకారమునకు సహకారులును, శ్రీ రామమూర్తి శ్రేష్ఠిగారి పుత్రికారత్నమగు శ్రీమతి, సౌభాగ్యవతి, వేంకటరత్నయ్యమ్మగారి భర్తయును, బొద్దాంహుండా షాపైరిటరులగు శ్రీ ధారాసూర్యప్రకాశలింగముగారి సుపుత్రులు అగు శ్రీ ధారాత్రిపురసుందరలింగంశ్రేష్ఠిగారు, తమద్వితీయపుత్రుడగు చి. సత్తెయ్యశ్రేష్ఠిని శ్రీ శ్రీ అన్నపూర్ణమ్మగారికి దత్తపుత్రినిగ నొసంగి, వంశవర్ధకులగుటయే గాక, ఆంధ్రవాఙ్మయము నభివృద్ధి

పరచుటకు శ్రీ అన్నపూర్ణమ్మగారిని ప్రోత్సహించి, భాషా సేవకు పూనుకొనిన శ్రీ త్రిపురసుందరలింగముగారి నభినందించుచున్నారము.

శ్రీసదాశివుడు, శ్రీఅన్నపూర్ణమ్మగారిని, దత్తపుత్రులగు చి. సత్తెయ్యశ్రేష్ఠిగారిని తద్వంశజులను, శ్రీమతి వేంకటరత్నయ్యమ్మ, శ్రీ త్రిపురసుందరలింగం శ్రేష్ఠిగార్లను తత్కుటుంబమును సర్వదా, సర్వథా ఆయురారోగ్యవిభవాదులను ప్రసాదించి, రక్షించుచుగావుతమని, పురాణదంపతులగు శ్రీపార్వతీపరమేశ్వరుల నభ్యర్థించుచున్నారము.

ఇట్లు,
వేపకొమ్మ గురువేంకటసుబ్బయ్య.
అధ్యక్షులు.

విజయనగరము,
3-4-1941.

# మృత్యుంజయవిలాసము.

## ప్రథమాశ్వాసము.



శ్రీకాంతానందకందాయ
చిదానందస్వరూపిణే।
నందితామరబృందాయ
ముకున్దాయ నమోనమః.

ద్విపద.

శ్రీరమణీలోల శ్రితజనపాల
కారుణ్యమయశీల కాంచనచేల
శరదంబురుహనేత్ర జలధరగాత్ర
యురుబుధస్తోత్ర మృత్యుంజయమిత్ర
త్రిజగతీపరిరక్ష శ్రీవత్సవక్ష
సుజనమందార కౌస్తుభమణిహార
కంకణాదురుబలఖగకులనాథ
శంఖచక్రగదాసి శార్ఙ్గసనాథ
బలువైన యాబహుబ్రహ్మాండకోటి
పొలుపొంద బొజ్జలో బూనినమేటి
శ్రీకృష్ణగోవింద చిన్మయానంద
లోకేశ సద్భక్తలోలముకుంద

# మృత్యుంజయవిలాసము.

నారాయణ జనార్దన మురారిశౌరి
కారణకారణ గజరాజవరద
యరవిందములకన్న నలరారునీదు
చరణయుగ్మమునకు జాగిలిమ్రొక్కి
వైకుంఠ వామన వారిజనాభ
నీకంకితముగ నానేర్చినరీతి
మృత్యుంజయవిలాస మృదుతర కావ్య
మత్యంతభక్తితో యక్షగానంబు
రచియించి నీకు నర్పణసేయదలఁచి
ప్రచురమౌ తత్కథాక్రమ మెట్టిదనిన,

దరువు-సౌరాష్ట్రి—త్రిపుట.

శ్రీవెలయు హిమవంతమనునొక-శిఖరిరాజము సరసభూజము
దేవతామయమగుచు నుత్తరదిశను జెలఁగుఁ ౧
సాలతాలతమాలతిలకర-సాలకురువక కుందవిచికల
మాలతీ సుమఫలములందుఁ జాలనలరుఁ ౨
కమ్మకస్తురికల్కి తావులగ్రమ్మ-జవ్వాజియను తుహినజ
లమ్మ కప్పురమందు నెప్పుడు నిమ్మమీరుఁ 3

మఱియు నగ్గిరివరం బెట్టిదనిన.

చూర్ణిక. శ్రీమదమలకమలరాగభాగ ప్రభాగతరాగ ధాగధ
గ్యహీరోపలవారకళా ధాళధళ్య కైతవానేక వివాకర నిశా
కరకర నికరధిక్కారిత మేరుతాం,సారతరవస్తుచారుతాం, నిజ

గుహాముఖనిర్గతసింహనాదభీతపాదాగ్రగత దీనదశముఖానేక పాళితయా బహుళదుర్గాంచితామిత నీలకంఠనివాసతయా పరిహసిత కైలాసతాం, మహాన్నృత్యవిలాసతాం గతస్సానుచరవరానుచరవిద్యుచ్చరశరజాత నేత్రాతపత్రితైః విద్యుద్దండచిత్రితైః కేకినికరనటనాలోక పరమనోజమహారాజ సభావిభాసితాధిత్యకాప్రకాశిత సురవరశరాసన మరీచిగుణగణఘటితపటుతరపటకుటీరవితానవిలాసధరైః రసధరైస్సమేతో ధాతురాగవీటిరససుందరకందరఖ్యాతి బంధురముక్తామణిగణేన, గంగాదితరంగిణీ ధవళదుకూలజాలేన, కటకతటీప్రకటీకృత మణిఘృణిరమణీయపాదవిలసనేన, ఘనజ్ఝరాసముజ్జృంభిత గంభీరవాగ్గుంభనేన, అతులితగతి చతురపదాతి మంజులకుంజరపత్త్రరథ ప్రబలసమ్మర్దసాంద్రప్రాంతభాగేన, హిమానీరుచిరయాలీనగగనముక్తాతపత్రేణ, అనుపమిత మహాధైర్యధౌరంధర్యేణ, భోగగుణగణమహిమాక్రామితాపరిమితధరణీ మండలేన నిజభూభృత్పరివృఢతాం, అతిదృఢతాం కుర్వన్నుర్వీతలే హిమవన్నామ గిరిరాజో విరాజతే.

క. అని యిటు లఖిలజనంబులు
గొనియాడఁగ నలరు మంచుకొండకుఁ గులకా
మిని యగు మేనక దనప్రా
క్తన పూజాకలనవలన గర్భముదాల్చెన్.

# మృత్యుంజయవిలాసము.

## ద్విపద.

మెలఁత లానందింప మేనకాదేవి
నెలదప్పి యొకవింత నీటుతోనుండ
వెలఁదికి నంతంత వేవిళ్లు బొడమె
బలువైన యరుచిచే బడలికల్మీరె
హిమధరత్వముగన్న మగనిచందాన
మహిఁ బూనదలఁచెనామను గ్రింగఁగోరె
మేను గృశించె క్రొమ్మిసిమిగన్పించె
కౌను లేమియడంగె కలిమి జెలంగె
మేలిమిభరిణల మీఁదిమూతలకు
నీలాలములు చుట్లు నింపినయట్లు
సొగసైన నీలచూచుకముల చేత
జిగిగుల్కుఁ జందోయి చెన్నొందుచుండె
వెలిదమ్మివలెమోము వెల్లనైయుండె
బలసెనిట్టూర్పులు బరువయ్యెసొమ్ము
లలనత మిగిలె రేఖావశిష్టములు
వళులయ్యె నంతటవనితనీక్షించి
యలశైలభర్త మిన్నంది జెలంగె
నెలలుతొమ్మిదియును నిండినవెనుక
చెలికత్తెలందరు చెలరేగికదిసి
పొలతికమ్మకచెల్ల! ప్రొద్దులుగడచె

## ప్రథమాశ్వాసము.

చెప్పదు బాలిక సిగ్గున మనకు
నొప్పులుగాఁబోలు నొగిలున్నదనుచు
తలయంటినీరార్చి తడియొత్తివేగ
కలిపితెచ్చినయన్న కబళమాయింతి
కసిగాటులుగఁదిని కడలేనియార్తి
వెసతాళఁజాలక వేదననొంద
నాడదానికి గండమగు నిదికడుపు
వాఁడు శ్రీధరుఁడుగావలె ననివేడి
కటకటా! యని వృద్ధకాంత లవ్వేళ
దిట్టమామంత్రౌషధీక్రియల్ జేసి
యిలవేల్పులకుమ్రొక్కు లిడి ద్విజరాజ
వలయికారుణ్యకథ్వనివినఁజేయ
ఘనతరసుముహూర్త కాలంబునందె
గనె కుమారు కుమారికామణి నంత.

కాఫీరాగము — ఆదితాళము.

సురలు క్రొవ్విరులవానఁ గురియించిరపుడు॥ ఉపపల్లవి॥
పరమానందమునొందిరి। ధరణిలోపలి నరులూ, సు॥౧॥
ముందుముందుగ దేవదుందుభు లఖిల దిక్కులందు
గంభీరనాదము గ్రందుకొనిచెలఁగఁగ
దందందందందం ధణాంధణాంధణాంధణాంధణాం
ధనియని మొఱయఁగ సు॥ ౨॥

# మృత్యుంజయవిలాసము.

అత్తరిరంభ మొదలగు బిత్తరిగరిమలు గుబ్బ
గుత్తులమీఁదదొప్ప ముత్తెపుసరులు దుముకఁగ
తత్తై ద్రిక్కృదుతక దితత్తైతత్తళంగయని
దాటుచునాడిరి- సు॥ 3॥
కరములయందువీణో త్కరములుబట్టి యుచ్చై
స్స్వరములుగంధర్వని కరములుకరమరుదుగ
సరిగమపదనిస సనిధపమగరిస
గరిమపామపాగమయనిపాడిరి
సురలుక్రొవ్విరుల వానగురియించిరపుడు.

## ద్విపద.

అంతట హిమవంతుఁడానందసాగ
రాంతర్నిమగ్నుఁడై యలరారెఁగొడుకు
నలినాప్తనిభుఁడునై నాకుఁడస్వైర
జలధిలోఁగ్రీడలు సల్పుచునుండె
కలికిగూతురురత్న కలికయోచంద్ర
కళయోయనంగఁ జక్కదనంబెసంగఁ
బార్వత్యుమాఖ్యలఁ బ్రణుతికినెక్కి
సర్వలక్షణగుణ సరణిఁ జెన్నొంది
యనుదినమభివృద్ధి నందుచునుండెఁ
దనివిదీరఁగఁతల్లి తల్లీలఁజూచి
వెలఁది పక్కననవ్వి విద్దెముల్ జేసె

# ప్రథమాశ్వాసము.

జిలిబిలిపలుకులు చెలరేఁగియాడె
ననిముదమంది యిట్లలరారుముద్దు
గనియొయారంబుల గనియననెగడి
పసిఁడిపువ్వులరంగు పరికిణి మెరయ
పరుసమొగ్గలయాకుపచ్చమేల్ రవిక
ముద్దులుగుల్కఁగఁ బెద్దముక్తాఫలంబు
లద్దినమద్దికాయలఁ జెలువొంద
నడుగుచిగుళ్ళ పర్యంతంబుకీలు
జడ తేఁటిగుంపుల సరణిఁ జెలింప
నతివదాఁగుడు మూతలాడెడువేళ
లతలలోఁ దానొక్క లతవలెదోఁచు
చెలులుగానఁగలేక చిన్నబోవుదురు
వెలఁదులు గనుమూయవేళ మిటారి
కనుదోయిచేరలకన్న హెచ్చౌను
వెనువెంటనేజూచు వెలఁదులనెల్ల
తరుణియాగతి దేవతాసిద్ధసాధ్య
గరుడగంధర్వాది కాంతలలోన
నాటపాటలయందు నమృతరసంపు
మాటలఁ దేఁటలమహిఁ బేరుకొన్న
విద్దెలబుద్ధుల వెలలేనిపనుల
ముద్దుల యుద్దులమురిపెంపుగతుల

మేటియైసూటియై మించినలీల
నాఁటికినాఁటికి నవనవలాడు
తనువునకొకవింత తళుకుప్పతిల్ల
వనితకంతంతజవ్వన మంకురించె.

సీ. పాటకరించినచిన్న పూపచన్నొలకలు
సరులలో పసిడిపూసలనియెన్న
కొలుకులు వెడలిచెక్కులనల్లుకొనుచూపు
చెదరు కాటుకయని చేలనొత్తు
కౌనపై నలరారు నూనూఁగునూఁగారు
నసదుకస్తురి రేఖయనుచుఁదుడుచు
తరుణులతో నాటతమిఁగిసాలుసనవ్వ
చెలిజల్లువిరులని చేతులొడ్డు
మించుపసమించు మైమిసమిసలుజూచి
పసపునిగ్గులకళయంచు భ్రమవహించు
నవ్యముగ్ధత యనుపమానముగనమర
వనితతొలుదొల్తఁ బొడముజవ్వనమునందు.

సారంగరాగము—ఆదితాళము.

అతివకునొయ్యనొయ్యన బాల్యముసడలెన్
జతురతవిలసిల్లెఁ జాపల్యమెడలెన్.
వడిగట్టితనమున కొడిగట్టెననఁగఁ
బడతి చనుమొగ్గలపయ్యెదఁబూనెన్.

## ప్రథమాశ్వాసము.

పవడంపుమోవిలో యువిదనవలరున్
చెవుల రతిశాస్త్రంపుఁజవుల పెంపెక్కఁగన్.
గలికిపూవిలుకాని ములికివలె జెలఁగున్
గులశైలసుత ముద్దుగుల్కుచునుండెన్.

### ద్విపద.

తలిరు ఛాయమున నత్తరిశైలకన్య
తులలేనియవయవ ద్యుతులశోభిల్ల
భువనజాతప్రీతి బొందించుకొఱకు
కువలయమిత్రాజ్ఞ కోమలిపాద
జలజసన్నిధిఁజెందు సద్గుణంబనఁగ
నలరెగోళ్ళుచిగుళ్ళు నడుగు బోలంగఁ
గలవె తత్పల్లవకాంతి లేదన్న
వలనొప్పమడమలు వటఫలరీతి
హాలముఖలేఖా సమధికలావణ్య
జలమగ్న మృదుపదజలరుహ ప్రపద
కమఠయుఙ్మంజీరకలిత కేదార
రమణీయకమల గర్భములననొప్పె
కాంతజంఘిక లింతి కంతునిపింత
దంతివంటిదియాటఁ దగ్గతులలరారెఁ
గననయ్యెఁ దత్కరాకారంబుదొడలుఁ
దనరెఁదత్కుంభ సుందరతచేఁ బిఱుఁదు

కటిశైల కందరగరిమఁ జెన్నొందెఁ
గుటిలకుంతలనాభి కుచసురాలయము
నందుండిపాక్కిలి యనుమినుకు బావి
యందుఁ గ్రీడకువచ్చు నెలనాగభామ
ఖచరమార్గంబునఁ గానురాజిల్లె
కుచసుధాకలశముల్దూర్చిచనట్టుల
నల్లచీమలబారు నాఁగనాయూరు
పల్లవపాణిపైఁ బరగుశృంగార
రసతరంగంబులై రంజిలెవళులు
మిసిమిగన్పట్టి చన్మిట్టలుప్పొంగఁ
గట్టుపట్టికిమేనఁ గల్గినవగుట
గట్టితనంబునగట్టులఁజేని
పరిహాసింపుచునుండెఁ బడఁతి దోర్లతలు
కరపల్లవములచేఁ గాంతిదనర్చెఁ
గందర్ప విజయశంఖంబయ్యెగళము
మందయానాన్యసామ్యముఁ జెందఁగోరు
చందమామకు మచ్చసడలగెన్నటికి
నిందుఖండంబునా నింతిచెక్కిళ్ళు
గాకున్న వాక్సుధాకణము లెట్లొలుకు ?
శ్రీకారములుకొమ్మ చెలువుగాకున్న
ప్రకటసువర్ణశోభవహించుటెట్లు?

ముకురాస్యరద కుందముకులముల్బోదవు
చిగురుబోల్మెమన భాసిలె నోష్ఠయుగళి
నగవొప్పెముత్తెపునత్తుడాలనఁగ
హరిణితిలోత్తమాఖ్యా కృతిమించె
నరుదెజన్మక్కు తీరగులేమయగుట
ననవింటిదొర ఫాల నయనుజయింపఁ
దన మేనమామ చేఁ దనుదాచుకొన్న
విలునమ్ములనఁగ భ్రూవిలసదపాంగ
ములుబొల్చె వెన్నెలబ్రోచునెన్నొసలు
తను కేశ కీసుమదామంబుబెనఁగి
కొనుసీలభుజగినాఁ గొమరొందెవేణి
తొలకరిమెఱపునాఁ దొలుతఁజిగిర్చు
నలరుదీగనఁ దళుక్కను జుక్కయనఁగఁ
జికిలిచేసినమరు చేసూరియనఁగ
నొకవింతసొగసులతోఁ దేజరిల్లె.

వ. ఇట్లు ననన్యకన్యాసామాన్యా గణ్యలావణ్య విలాసభాసిత యగు నప్పార్వతి పర్వతరాజసమీపంబుననున్నయెడ నారదుం డరుదెంచెనట యెటువలెననఁగా.

రాగ—పంతువరాళి—అటతాళము.

నారదమునివచ్చెను
గంధర్వకిన్నరులెల్లమెచ్చెను॥ అనుపల్లవి॥

నారదమునివచ్చె నగరాజుచెంతకు
శారద నీరదశారీరరుచిమీఱ॥ నారద॥ ౧

నొసలనూర్ధ్వపుండ్రమెుప్పౌజడల
కిసలయరుచిదిశలుగప్ప
యసదృశభక్తి పద్మాక్షమాలికలు
తులసిదామములు గంఠలగ్నములుగ జేసి॥ నార॥ ౨

ఉరమున వల్లకిగుల్కా
అదియు హరినామమె వరుసబల్కా
వరద నారాయణ వాసుదేవాచ్యుత
గరుడాశ్వకృష్ణశ్రీధరయనిఙొక్కుచు॥ నార॥ 3

కలితకక్షపాలభుజమున
కమండలువునిజహస్తాంబుజమున
నలరారు వేలుపులాచరించుచు
మెుక్కులుగొంచునాట నెమలికుంచెవిసరుకొంచు
నారదమునివచ్చెను గంధర్వ కిన్నరులెల్ల దమమెచ్చను.

ఉ. వచ్చినమౌనిఁగాంచి నగవల్లభుఁడల్లన మ్రొక్కి, పూజ పెం
పచ్చుపడంగఁజేయ ముదమంది సతింగని యీశుఁడీశుఁడై
యిచ్చపలాక్షికర్థను విచ్చును రామసహస్రనామసం
పచ్చతురాత్మఁజేయుననిపల్కి మునీంద్రుఁడదృశ్యుఁడైచనెన్॥

రాగము—కాంభోజి—ఆదితాళము.

అవనిధరాత్మజయు నానందమునఁ దనకు
ధవుఁడీశుడనిపొంగి తనబోటికనియెన్. ౧

శివుఁడేడ నేనేడ చెలినన్ను జెందునంట
యవునమ్మయిదియేమొ ఆశ్చర్యమనుచున్॥ అవని॥

రాగము—తోడి, ఆదితాళము.

జవరాలికంతకంతకు వలపగ్గలముగా
శివుమీఁద జింతనుండెన్.

ద్విపద.

శ్రీసదాశివుఁ డర్ధశీతాంశుధారి
దాసపోషణకారిదక్షకుమారి
నెడబాసి నదిమొదలెచటనుచిత్త
మిడకయాగుణవతిహిమవంతునింట
జనియించుచెటిగిఁ తచ్చైలోపవనికి
ననుపమతపముసేయఁగ నగనేత
తనతనూజాతఁనూతనకళ్లోపేత
గనిరావె యోకొమ్మ! కనకపుబొమ్మ!
నాకూర్మినెలకూన నాతలికాన
నీకేళివనిలోన నీలకంఠుండు
మునివృత్తినున్నాఁడు మున్నిట్టియోగ
ఘనులకుఁ బనిసేయఁగన్నె లేదామె
కావున నీవు వేగమెమహాదేవు
సేవజేయుమటంచు జెప్పినయపుడె
పరమసంతోష సంభరితాత్మయగుచు

హరునిచిత్తమువచ్చు నట్టుమెలంగి
నామదికోర్కె జెందంగఁగలననుచు
ప్రేమమీరంగ నారీరత్నమంత॥

సీ. బొమవింటఁదొడగిన పూజిల్కదారముల్కి
పోల్కెఁగస్తురిసొగసు బొట్టుదిద్ది
చకచక లీనుతారకలతళ్కులవోలె
కొలుకులు వెడల కజ్జలముదీర్చి
పొడవుగుబ్బలమీఁదఁ బొదవునీరెండ నా
రంగుచందురు కావిరవికెదొడిగి
పిఱుఁదుపొక్కిలియను మెరకపల్లముఁగప్ప
పాలవెల్లినిమించు చేలఁగట్టి
యంచగొదమలగమి బెదరించులాగు
నందెచప్పళ్ళు ఘల్లుఘల్లనుచు మెఱయు
నడుము జవజవలాడకీ లెడచలింప
వచ్చుముక్కంటి సేవకు మచ్చకంటి.

సారంగరాగము—ఆదితాళము.

వచ్చి శంకరునిగాంచెను-నగరాజతనయ
హెచ్చి మోహమునమించెను॥ అను పల్లవి॥
వచ్చిశంకరునిగాంచె-నచ్చెరువునకును
విచ్చి కల్వపువ్వులుదెచ్చి వెదజల్లినట్లు॥ వచ్చిశంకరు॥ ౧॥

## ప్రథమాశ్వాసము.

పచ్చవిల్తుఁడటు హెచ్చిశరంబులు
విచ్చలవిడి యెద గ్రుచ్చినతాళక
ముచ్చటపడితిమి-పచ్చిదేరపడి
దెచ్చిమార్చితన-నెచ్చలిచాటున॥ వచ్చిశంకరునిగాంచెను॥

వ. ఇట్లువచ్చి, శంకరునింగని కరకంకణనిక్వణంబులు సెలంగ గ్రొమ్మొక్కి, కురంగటమెలంగుచున్న యక్కురంగనయనం గని, భృంగియాశ్చర్యసాగరంబునంబొంగి-స్వామీ దేవరవారి సామీప్యంబున నొక్క చామీకరగాయత్రి వచ్చియున్నయది యీచిన్నది తపోవిఘ్నంబు సేయంగలదు సెలవేని సాగనంపించెదననిన పురారి యోరి ! యుపచారంబు సేయుచుండుం గాక యుండనిమ్మనిన నయ్యా ! వెఱచిచెప్పుదునో వెఱవక చెప్పుదునో వెఱపేలజెప్పరాయనిన యీయిందువదన యందముచందము తక్కులు సొక్కులు, వన్నెలు చిన్నెలు, చూపులుకోపులు,చూచి, యీయమ్మవారిం దగులుకొని మమ్మ నక్కరసేయరని భయంబు దోఁచెనయ్యా యనిన నయ్యిందుకళాధరుండు,మందస్మిత సుందరవదనారవిందుండై యోరీ! యంతపని యేల బుట్టురాయని యాదరించెనంత.

కలికిలతకూననిగనిల్ గులికిచూపు
నల్లగలువవిరులు మేనజల్లునపుడు
నీలకంఠుండు నెంచకనించెఘర్మ
జలవసంతంబు కుంకుమోజ్జ్వలకుచముల.

రాగం ముఖారి—ఆదితాళము.

వలిగట్టుపట్టి సేవసలిపెనౌర-యెంతా
నెలదాల్చు చెలువుని చెంత నీటుదేర॥ వలిగ॥౧॥
అలరుమావుల చేత-నమృతధార చిలికి
పలుచాయ ముగ్గులు దీర్చి బాగుమీర॥ వలిగ॥౨॥
కలికిచూపుల సింగారమవుర !
నల్లగలువతోరణముల కలిమిదేలుర॥ వలిగ॥ 3॥
కులుకుచక్కాని చెక్కులపేర నిలుపు
నిలువుటద్దాము నెదుటా కళజెన్నార॥ వలిగ॥౪॥
మొలకనవ్వుల తేట ముద్దుగారా
తెల్లయలరులునించుశివుని యెదుగులార॥ వలిగ॥౫॥

వ. ఇట్లు సేవసల్పి యమ్మ్యంగనభృంగిఁగని నీవు గంగాతరంగిణీధరు నంతరంగంబెఱింగినవాఁడవౌదువు తదంగీకృతంబులగు పనులుదెల్పిన సేయుదుననిన నతండు వికవికనవ్వి యవ్వా! యివ్వాసుదేవునకు నెవ్వరు సేయుపనులెవ్వి ? దోవతులుతికిచ్చెదనంటివా యీవేల్పు యేనుంగుతోలుదాల్పు మజ్జనంబునకుసజ్జలంబులు దెచ్చెదనంటివా యితని శిరంబునఁ బెద్దనదియున్నది; వీవనలవిసరెదనంటివా యితనిమేనిపాములు మెసవుగాని యసదుతెమ్మెరలు సోకనియ్యవు;నీవింక వేగిరంబోఁగిరం బిడిమెదనంటివా యమ్మా నీకుజెప్పకేమి-పుణ్యాత్ములయిన వారు భక్తిగలచిత్తమ్ముల షడ్రసాన్నంబులిడిన నార

గించి మేమూసపడకుండ విసవ్రమేతరిమై తిరిగి యిచ్చుట యున్నట్లయుండు సేనను మిక్కిలిదగ్గిర డాయంబోక కావలయుపువ్వులు మొదలయినవి తెచ్చియిచ్చుచుందుము. నీకు నతనియందు నాసయున్నట్లు యున్నది. యమ్మహాత్మునకు నీవు సేయుసేవ యంగీకృతంబై నట్లు యున్నది దైవగతిని మీరొక్కటియైన నాపయి దయయుంచవలెనని శివపూజార్థంబు పువ్వులచెట్లకు దోహదంబులు సేసిరట మెటువలెను.

ఆనందభైరవి—ఆదితాళము.

తిరముగ తమలపాకుతీగెలెల్లా-తీయ
చెరుకుగడలు నాటరే యోచెలియలార
పసరుకినిమిసి చప్పరములందు-పుష్ప
రసముకలజల్లరె యోరమణులార
సురపొన్న మొక్కలు నాటిన చుట్టుపట్ల-మంచి
చిరువేళ్ళ దళ్ళుగట్టరె కొమ్మలార
కులుకుసంపెంగ చెట్లకొనలయందె-తెల్ల
గురువిందలుంచరె యోకొమ్మలార.

వ. అనిన భృంగిగంతులువైచుచు నిట్లనియె.
అబ్బిబిల్లిగసల్లుమల్లెలేలె
తెల్లజిల్లెడుచెట్లు వేయరె తల్లులార
మమ్మురముగగ్రమ్మ జాజి మొక్కలేలె
మంచియుమ్మెత్తలువేయరె యోయమ్మలార

మొక్కడలేని సంపెంగలిక్కడేల
తుమ్మిమొక్కలునాటరే యోయక్కలార

ద్విపద.

తరుణులగూడి యత్తరుణేందునటల
పరసాంబుయంత్రంబు సరసజెన్నొందు
బంగరుపనిరంగు బంగలాయింటి
మంగళబహువిధ ముంగళసూన
సంతానములనొప్పు సంతానకల్ప
కాంతారమారతి కాంతాయుధముల
నెపుడాలుగనుపించు నెపుడాచరమున
కపురంపుజిల్కు జొక్కపురంభలందు
నల్లిబిల్లినద్రాక్షలల్లినచోట
జల్లగాతావులు జల్లగామరియు
పల్లెపందిళ్ళు చామంతికుదుళ్లు
మొల్లలుజాజులు మొల్లమయినట్టి
పజ్జలనలరార పాదులనిండ
బొజ్జంగిబూబొదలు మరియు నుప్పొంగు
పన్నీటతెలినీట పదనున నెమగు
పొన్నగున్నలు సురపొన్నలు మరియు
వకుళరసాలలవంగలుంగాడి
సకలపాదపములు సఖులందుబోలె

# ప్రథమాశ్వాసము.

నొకదాని చేపట్టి నొకదానిచూచు
నొకదానికౌగిటనుంచు సంగీత
మొకదానిదరిబాడుచుండు మోమెత్తు
నొకదాని చేత నిట్లుచితకృత్యములు
హొయలుమీరగ దగనొనరింప నవియు
దయముచ్చటాడిన దన్నినగాని
తుదిమీదను మసినతొయ్యలులార
యదిమాకునున్న నయనినవ్వుమాడ్కి
బువ్వులబూసిన పువ్వారుబోణి
పువ్వుబోణులతోడ బువ్వులుగోసె.

రాగం—కన్నడగౌళి—ఆటతాళము.

ననలుఁగోయువేళ చెలిని నవ్వి రింతులు॥ ననలు॥
మనసుచెంత చంద్రమౌళిపైనుంచి మెల్లనె॥ ననలు॥
కొనకోటితళ్కులఁ జూచి- ననలని కొయ్యబోయిన-
ననబోఁటిగోటితళ్కులని- ననలమానిని॥ ననలు॥
తనచూపుగుంపుల తేఁటి దాటులని తోలఁబోయిన
ఘనదృష్టిజాలమనిభృంగి- గణములుమూగినఁదోలక॥
ననలుగోయువేళ చెలిని నవ్వి రింతులు॥

క. జవ్వనిమరుఁ డీఁక ప్రియుపైఁ
జివ్వకువచ్చునని యతని చిలుకలకణకల్
నివ్వటిలఁ ద్రుంచుపోలికఁ
బువ్వులువడిఁగోసి పువ్వుఁబోఁడుల కనియెన్.

చ. చిగురుజడల్ జెలంగ, దరిఁ జెందిన క్రొవ్విరిచాలు పేరఁ జె
న్నగు నెలకూనలింపు మెఱయం దగుపుప్పొడిభూతితోలతో
రగ వర భూషలొప్ప మకరందవియన్నది దాల్చి శర్వసో
యగము వహించుకల్పకన గావళిపజ్జల భృంగులాడెడిన్.

వ. అని మందస్మితంబుసేసి,

వరాళిరాగం—ఆదితాళము. (లేక)

సావేరిరాగం—ఏకతాళం.

తిరముగఁ దమలపాకు-తీగెల్లఁదియ్య
చెరుగెడలు నాటరె! యో-చెలియలార!
పసదు కిసిమిసి చ-ప్పరములందు పుష్ప
రసము కలియఁజల్లారె రమణులార॥ రా॥
సురపొన్న మొక్కలు నాటిన-చుట్టూపట్ల మంచి
కురవేళ్ల దళ్లఁ గట్టరె-కొమ్మలార!॥
కులుకు సంపెఁగ చెట్ల-కొనలా యెమ తెల్ల
గులివిందతీగలుం చరె-కొమ్మలార॥ తిర॥

వ. అనిన గంతులువైచుచు భృంగి యిట్లనియె.

అల్లిబిల్లిగా, నల్ల మల్లెలే, మంచి,
జల్లెడు చెట్లు వెయ్యరె—తల్లులార!
ముమ్మారముగఁ గ్రమ్మ జాజిమొక్కలేల
మంచి వృమ్మొత్తలు వెయ్యారె యోయమ్మలార!

ఎక్కడ లేని సంపెంగ లిక్కడ లేతుమ్మ
మొక్కాలు నాటరే యో యక్కలార !॥

ద్విపద.

అనుపమ వేషయై ఆది మాయోష
దినదిన మొకవింత తేటతో వచ్చి
మగరాలపౌజు కమ్మలదగద్ధగలు
సిగమినువాకపైఁ జిందులుఁద్రొక్క
శేషభూషుఁడు ప్రదక్షిణముగావించి
యాషన్న తాంగియై యెదగుబ్బలొరయ
ప్రచుర మేచక రుచిప్రచయయుక్చలిత
కచచకచ్చకలీను గళము చుంబింప
ప్రెముక్కనెన్నొసలు సొంపులుచూచి వాఁడి
ముక్కంటితలపువ్వు మునుచిన్నఁ బోవ
చెంగటఁబరమేశుచేఁ జింకబెదర
పొంగారు నోరజూపులఁజూచుచున్న
పురహరుండంత తపోయోగ్యమైన
యరఁజూపు నొయ్యారి సరసి నిశ్చేష్ట
తనయోగనిష్ఠనెంతయుఁ బెంపుసేయ
తనువిభూతివివర్ణతనుగప్పిపైవ
ఘనమా సముద్ర గద్గదికనుమాట
వనితపైఁగూర్మి యవ్వారిగానుండ

హేత్వంతరములుండు టెఱిఁగియీశ్వరుఁడు
సాత్వికభావంబు సడలంగఁజేసె॥.

ఉ. ఆసమయంబునందు సకలామరు లింద్రుని గూడి తారకా
ఖ్యాసురబాధలెల్ల జలజాసను సన్నిధిఁదెల్ప బ్రహ్మ యా
ర్యాసమనేత్రులంగలుపుఁ డంతఁజమూపతి గల్గి, దైత్యు వి
తాసునిజేయునన్న దివిజాగ్రణి మన్మథునిం దలంచినన్.

ద్విపద.

అంతటఁగాముండు హరిహర యనఁగ
గంతుకాముండు చొక్కపుఁజిగురాకు
పసిమిగులెక్కుడు కుసుంబాపాగఁజుట్టి
వెసబంగరపురంగువిరులంగిదొడగి
పసిఁడిగేదఁగిబాకు బగుఁలునజెక్కి
పొసఁగచెంగల్వ కెంపుతురాధరించి
చిలుకతేజీలఁబూన్చినకమ్మగాలి
బలుతేరిపై నెక్కి బతిమాలుచున్న
రతిదేవిగని నవ్వి రమ్మనిబాహు
లతికలుబట్టి మెల్లనపైకిఁదిగిచి
వామాంకముననిల్పి వట్టువగుబ్బ
పై మేలు మోహనాంబకము గీటుచును
చెరుకు విల్లెక్కిడి చేనింతఁబూని
త్వరసురవరపురి దరియంగ నగిరి

# ప్రథమాశ్వాసము.

తెలుప యందిచ్చెడి తెలనాకుచుట్ట
కొటికి యొసంగుచు కొమ్మ కిట్లనియె.
నలినాక్షి యివియన్నదిచూడు హేమ
జలజహస్తముల రజంబంటనెగుసు
గండుతుమ్మెదలబంగరుబంతులాడు
చుండునుత్పలగంధియొయ్యనాచు
పెన్నెరుల్ జెదరంగబేడిసచూపు
చిన్నెలుబెళుకంగఁ జెన్నెలరారు
నాతిగన్గొనుమిందె నందనారామ
మిాతోటసోయగంబెంచనలేదు
చరియింతు రిచ్చనిచ్చటపూవుఁబొదల
గరుడగుహ్యక యక్షగంధర్వసిద్ధ
సురముఖ్యదంపతుల్ చూడులతాంగి
తరుణియల్లదె కల్పతరువాటిఁజూడు
చలివేళఁ బెట్టవేసవి చల్వచేయు
పలుదెరంగుల పుష్పఫలములనిచ్చు
పనియెంతకామితఫలము లొసంగు
ననిననఁ బ్రోడికటాక్షబంభరికిఁ
గానుకయొసఁగెదు కైవడినొక్క
సూనమంజరిచెవి సొగసుగానుంచి
మదనుఁడయ్యుపవనమార్గంబు గడచి
మదగజగమనతో మఱియు నిట్లనియె.

బిలహరి రాగం—ఆటతాళము.

ఇదిగో యైరావతమే యోకొమ్మా పట్టపు
టేనుఁగె వజ్రికి ముద్దుగుమ్మా॥ ఇది॥
కుదురునిండిన సీదుగుబ్బచన్నులతోడ
నెదిరించుకుంభమ్ము లీకుంభికలరెడు॥ ఇదిగో॥

సారంగ రాగము—ఆదితాళము.

ఉచ్చైశ్రవమిది బాలా - కలశోదధిబుట్టెను నీల
మెచ్చులుగాను నేవేళ - శుభమిచ్చు
చిహ్నములుచాల - యచ్చపుబంగరు
కుచ్చులపల్లము - దెచ్చియిడిన యిదె
వచ్చెవినతికొడు కి - చ్చటికని మది
ముచ్చటలెస గవి - యచ్చరజాలము
లచ్చెరువడుదురు॥ ఉచ్చైశ్రవ మిదిబాలా!

వ. ఇట్లు పచ్చవిల్కాఁడు నెచ్చెలితోఁ ముచ్చటలాడుచు నరిగి యరిగి తిరిగిచూచి యహో! పంకజమిత్రుండు గ్రుంకుమెట్ట మీఁద వీడుచన్దోయి సొంపునింపు కెంపుపతకంబునుంబోలి యున్నవాఁడని సరససంగీతభంగీతరంగీకృతాతరంగ కురంగ నయనాకృతమృదంగధిత్త ధిమి ధిమిన్నాదవేణువీణానిక్వాణ సంపూరితనానాగోపురంబగు నాగోపురంబుం బ్రవేశించి, పటుతరసంధ్యారుణరుచిలంపటజటా-పటకాషాయపటలలిత సాయమనుష్ఠానార్థ వియత్తటినీయాతుకామామరమస్క-

రులకు నోసరిలి నమస్కరింపుచు, రోహిణీరమణోపలఖచిత విపణిధరణీతల ప్రతిఫలితతారాగణద్విగుణితాగణిత మణిఘృణులకరుదంచుచు, నభిసారికానయనకనీనికాకజ్జల నిచయ కాలాగురు కలితంబగుకటిక-చీఁకటిప్రాపునయథేచ్ఛాదిఱుగు జారచోరజనపరంపరలు పఱువులెత్తి మూలమూలలకు నొదుగఁ, జంద్రుం డైరావతంబుపోలికె కలంకమద రేఖతో నభ్రముసమీపంబున కరప్రసారంబుచేయుచు నంతకంతకు నుదయ రాగరాంకవంబు దిగంద్రోయ వెలుంగం దిలకింపుచు, వలచివచ్చిన మేనమామకూఁతురు వావి గాదన్నకరణి తెఱువరులగరువంబు నఱుము సేయుకొలఁకు నచ్చరమెఱుంగుబోఁడులచిఱునగవుల మెఱుఁగులుండ నిది యేలని క్రొన్నెలం బోడమువెన్నెలం దిరస్కరించిన ప్రోడలమేడల వాడల నీడలజాడల వచ్చివచ్చి యెక్కొక్కదరుల బిత్తరుల మొత్తములు సరసచిత్తముల రసికసత్తములతో నెత్తంబులాడుచు, కవర లంకించి వేయునెడ కెంపుటుంగరంబులమెఱుంగులతోఁ గలసి హస్తపల్లవంబులు ధగద్ధగితంబులుగా నెగసిపడుచు నవి నల్లగలువతెగలఁ గవయు మగతేటిగములపగిది నిగనిగల నెగడుసోగను చూపుగములు సొగటాలపాళిపైఁ జెదర నిబ్బరంపుటబ్బురంపు సిబ్బెంపుగబ్బిగుబ్బలయుబ్బునం బిగిలిన నీలి రవికెలలో నీటుదేరు తదీయచ్ఛాయలు గీటురాతిమీఁద నేటుగను కుందనంపురేకుల యందంబునం జెంద మదనోన్మా

దంబునం దమతమిబయలుపడఁ బ్రియులు తమపిఱుందనిలిచి చూచు చిఱుతకన్నియలంగని యిదే యీవగలాడి బంగరు సారెలు పయ్యెదలో దాఁచుకున్నదని మొలకచన్నులు చిదిమిన నదరిపడి కరకంకణకటక కాంచికాఘణఘణలు నివ్వటిల్ల నవ్వలికి మొముకంబోవు నవ్వేలంములం బెనంగి, పట్టుకొని నవ్వుచు జెక్కెంబులకు చక్కనికడానిబేడిసలం బట్టు మదనమూతుఁలంబోలు వారిం దప్పక వీక్షించి నాచిన్నయొప్పులకుప్ప లప్పుడాటలు చాలించి, బాలపాపల నీలీలఁ గేలిసేయుదురేయని మీపనికేమి నాపగఁదీర్చుకొని యెదమను నభిప్రాయంబు తేటపడం బాటించి కేలుంగీలించి కూడి మేడలోపలి కరిగి యనల్పంబులగు హంసతూలికాతల్పంబులవసియుంచి, హాయలుమిగిలిన పికిలిపిట్టలం బోట్లాడించుకొలకు నామిషంబు గలుపించుకరణి విడియంపు మడుపు లందిచ్చు నూడిగంపు చేడియలవీడుకొల్పి, ముడిసడలించునెడ నెడలేక సడలించు జిగిబిగికౌఁగిలింతల వింతల నింతింతలై పోవు రవికలయవస్థంగని బెగడిన చందానఁ దనకు దాన నీవి వదలినం గదసి యధరపల్లవం బంగుళంబుల నొక్కి మెదపి, యామూలచుంబితంబుఁ జేసి తద్రసమాధుర్యంబునకు సొలసి, గిలిగింత గొలిపి చెలులతలిమంబులనునిచి మును పుపనిమొనల గడిదేఱిన మహావీరులగుట నప్పురుషులు తదీయకుటిలభ్రూధనుః ప్రసాదితంబులగు చుఱుకుఁజూపుల

వాడికోలలకు డీలుపడక నిశ్శంకఁజేయు హుంకారంబులకు జంకికొంకక నఖాయుధంబుల నలుకులకు వెఱవక నుచ్చైస్త నఘటనంబులకు తగ్గక రొమ్మిచ్చి విచ్చలవిడి మదనకదనంబు నం బెనంగి, జలజరాగతాటంకాంకిత వనితాననంబులు చూచి మునుపు తమరుభేదించుకొనివచ్చునప్పుడు సవివరంబగు రవి బింబంబును తారావరబింబంబును తలంపులకువచ్చిన కఱం గకుండ నంతరంగంబుతో తెరపివెన్నెలబయళ్ళ గలయఁ గమకించి మీఁదియంతరువులకు సంతసఁజేసిశశికాంతసోపాన వితానమార్గంబున నెక్కునక్కాంతులవదలక యాలత కూనలత్యంతప్రియరత్యంతరాయంబులు గాకుండ కరపాద పల్లవంబుల గంధకటులం గౌఁగిలించుకొని కల్పతరుకాండం బున కెగఁబ్రాకి, తదాసవపానంబుసేయు నలవాటున ప్రియా ధరమధుర మధురసంబులు గుటుగుటుక్కునంగ్రోలి యపరి మితంబులగు సురతంబుల పరితలంబున విరిపరపులంబేర్చు నా నేర్పరులంబైకొని కరకంకణకటుకాంచికలు బిగియించి యవికలగతుల గతుల కుముకులపోలిక కొంతదడవు సురత తాండవంబు నెఱపి యెడనెడ తమతమనడుములు కేలందోడ రిపట్టు నాదిట్టవిటులందిట్టి చెక్కులంగొట్టి చెమ్మటందొట్టి మెట్టకేలకు నిట్టట్టనరాని సౌఖ్యానుభావంబుల భావంబులు గఱంగి కీల్వదలినబంగారుబొమ్మల తెఱంగున నురంబులవ్రాలి సోలి, తోడనెకఱంగు నారసికపుంగవులం గౌఁగిలించుకొని,

యఖండానంద పారవశ్యంబునొంది, మందాకినీసుందరకన కారవిందమకరందబిందుసందోహబృంద మిళన్నందనమంద పవనంబున సేదదేఱి మరలనిజప్రియులు మెల్లఁగరంబులుసాచి కుచాగ్రంబులపై వైచి ముత్తరులదరులకు రానిచ్చి మిక్కిలి సొగసుపొక్కిలి నిమిరినితంబవిస్తారంబుగాంచునెడ హుంకార పూర్వకంబుగా విదళించునమ్మించుబోఁడులకరకంకణ నిక్వణం బులువిని యిదియేమి మదీయకోదండ రవంబునంబోలియున్న దని నివ్వెరపడుచు మఱియు నొక్కొక్క సౌధరాజుల ముద్ధ సోమయాజులు తమ్ముగవయందివురుదివిజవనితలంగని మేమన్య స్త్రీసంగమం బెన్నఁడెఱుంగని వారము మమ్మునంటకుండుఁడనిన మేము స్వస్త్రీలమే కాని యన్యస్త్రీలము కాము మీరుసేయు తపోవిశేషంబులవల్ల నిట్టిరూపవిశేషంబులతో మిమ్ముఁబొం దవలసెననిన వారుతత్కుచనిచయావలోకనంబునకునహో రాత్రియనియునుతదాననదర్శనంబునకు రాకానిశియనియునుసంశ యించిన నచ్చాతుర్యవతులు నమస్కారవ్యాజమ్మునఁఫాలచతు ర్థీచంద్రదర్శనంబుఁ జేయించి యంతఃకలంకంబులువాపి, కుసుమచాపకేళిందేల్చుచు మణితవాగ్వ్యాపారంబులుగావిం చిననప్పణతులతో నిప్పుడు సంభాషణయోగ్యకాలంబు గాద నిమానంబున హస్తసంజ్ఞలుసేయు నయ్యింతులు దంతక్షతన ఖక్షతంబులుగావించిన నవ్విప్రవరు లలిగిన నిష్కారణంబు మముంగఱచి గిల్లుదు రేమని యాద్ధత్యంబునలేచి శుద్ధాచ

మునంబులుఁజేసి యావలికిజరుగు నమ్మహాత్ముల బలిమాలు నబ్బోటుల యమృతంపుతేటలగు మాటలువిని యిదియేమి? మదీయదివ్య రథశుక భాషణంబులవలె నున్నదని వెఱఁగు పడుచు మఱియు నెక్కడెక్కడ పెక్కుదిక్కుల లెక్కలకు మిక్కిలియగు చక్కెరబోణుల చక్కదనంబులుఁజూచుచు పురందరమందిరద్వారంబు ముందునిలిచి తనరాకపాకారి కెఱింగించిన నతండు శచీయుతుండై మిత్రామాత్యసహితుండై రంభాదినటీనాట్యదిదృక్షాపరతనుండియు కార్యాపేక్ష దక్షాంతరంగుండు గావున తనకునభ్యంతరంబేమి యేల యీవింత రమ్మనుమని తగువారిం బనిచిన కంతుండు సంతసంబెసఁగ మొగసాలఁగడిచియతిపాలిత నూతనరత్నకలిత విశాల చంద్రశాలాదినిలయజాలం బవలోకింపుచు ననేక కక్ష్యాంతరంబులు నిర్వర్తించి ప్రకటితవిశ్వకర్మమర్మకర్మ నిర్మాణ విచిత్రమణి చిత్రగవాక్ష ద్వారకవాటాదిబంధురంబునుపారిజాతవనీజాతసుమజాతజాతపరిమళోపేతంబునుభోగవతీభ్రమద శశికాంత బద్ధాంబుయంత్ర నిర్గతమందాకినీ ధారావిరాజితంబునుదివ్యతేజోవంతంబగు వైజయంతంబున మణిమయ సింహాసనంబున సుఖాసీనుండగు సునాసీరుంగాంచి నమస్కరించి శచీసన్నిధానంబున రతీదేవినుండ నియమించి పంచ శరుండు నిజాజ్ఞ నర్ధాసనంబున గూర్చున్న నింద్రుం డమందానందసాంద్రుండై యరవిందసౌందర్య సదనమదన

వదనంబవలోకించి కించిద్దరహాసంబునఁ గుశలప్రశ్నంబుఁ
జేసి విలాసవాసంబగు నాగవాసంబులకటాక్షనిరీక్షణంబుఁ
సేయుచుండె నంత.

సీ. సుందరయువదృఙ్మిళిందమాలికలీల
సొగసైన జడ మేనఁ జుట్టికొనఁగ
మదనకోదండసంభవగుణధ్వనిరీతి
నందెల నినదంబు గ్రందుకొనఁగ
గురుశంఖ శంకఁ గైకొని హారము ప్రదక్షి
ణములొనర్చు గతికంఠమున దిరుగ
దరినున్న తెలిముత్తెసరులు జారినభాతి
నొసటిపై స్వేదబిందువులు దనరఁ
గంతుఁ డాడించు వింతపూఁబంతియనఁగ
పొలుపుగలజాళువా కీలుబొమ్మయనఁగ
లలితమారుతచలజాతిలతయనంగ
నాట్య మొనరించె నట రంభనవసరమున.

క. ఊర్వసినటియించెనుగుచ
పర్వతముల హారసరులు పటుగతి నెగయన్
సర్వసుపర్వులధృతి మరు
దోర్విలసనమహిమచేతఁ దోఁత్తో నెగయన్.

చ. నకనకలాడు కౌ న్వణఁక, నవ్వుమొగంబున హస్తకంకణ
ప్రకటఝణంఝణల్ జెలగబంగరుటందెలు ఘల్లుఘల్లనం

తకుఝుకుతక్కధిక్కతకధక్కిట ధిక్కిటరతక్కిణాంగుఝేం
తకధికయంచు మేనక యథావిధి నాట్యముసల్పెవింతగా
మఱియుహరిణి తిలోత్తమ మంజుఘోష
యాదిగాఁగల చెలులనాట్యములఁ జూచి
నవ్యగంధర్వగీతి కానందమొంది
యందఱిని పేరుకొల్పి యిట్లనియె వజ్రి.

రాగం మారువ—ఆటతాళము.

ఇన్నాళ్ళకుమిముగంటిమీ-మదన
యీప్రొద్దుసుఖలీల నుంటిమీ॥ అను॥
నన్నుసుతతుల్యునిగాఁజూడక
యిట్ల-నందగునెసురనాయక॥ ఇ॥
నీకుఁగాక మాకార్యముసేయ-నెవ్వరికి గల్గు నీశౌర్యము
నీకారుణ్యముగలిగిన యింద్రా
నాకేమి యల రుద్రు డలిగిన॥ ఇన్నా॥

వ. క్రమ్మరనమ్మహేంద్రుండిట్లనియె.

ద్విపద.

వినుము మన్మథ ! జగద్విజయప్రతాప
నినుఁబిలిచిన పని నే వివరింతు
తారకదైత్యుఁడందఱ నలయింప
నారాక్షసుని ద్రుంప నలవిగాకున్న
శివకుమారుండైన సేనానిఁగోరి

శివునకుతనయుండు సిద్ధించుకొఱకు
నుమతోడ నద్దేవు నొనగూర్చుకృత్య
మమరింప మరుఁడుగా కన్యు లిక్కార్య
నిర్వాహకులె యని నిన్నుగోరితిమి
పార్వతీపరమేశపరిణయఫలము
దుష్టశిక్షయు సుధాంధోవిప్రముఖ్య
శిష్టసంరక్షయుఁ జేసికొను వేళ
యిదిగదా! యని వేడ్కనించువిల్కాఁడు
మదమున నుప్పొంగి మఘవుని కనియె
నలవసంతుని సహాయముఁగొని నీవు
సెలవుచొప్పున శివా శ్రీసదాశివుల
నొక్కటిగాఁ జేతు నొక్క బాణమున
గ్రక్కున ననుచుఁ గంకణ మెగనొత్తి
మీసంబు వడివేసి మీవానిత్రాణఁ
జూచుకొమ్మని లేచి జోహారుసేసి
శతమన్యునిర్దిష్టచతురసౌధమున
రతిదేవితోడ నా రాత్రి వసించె.

ఉ. అంతటనుగ్రుపైఁజనుట కారతిబెగ్గిలి, చిన్నవోయి శ
య్యాంతమునందుదైన్యముబయల్పడఁ బుక్కిటఁ జేయిచేర్చిచ
న్వంతులు నొక్కగాఁడివురు ప్రాణవిభుం గని తాళుమంచు న
త్యంతవిషాదయై పలికె నంగన కన్నవ నీరుక్రమ్మఁగన్.

## ప్రథమాశ్వాసము.

ద్విపద. ఔనోయి మన్మథ! యహహా! నీబుద్ధి
కేనేమి యనుదాన నీశ్వరుతోటి
వలువనిపగ సేయవచ్చునా? మనకు
బలభేదికేమి జెప్పఁగ వచ్చు సేన
హరునితపోవిఘ్నమాయెనా మేలు
దొరకెనటంచు సంతోషించుగాని
మనకొక్కకీడైన మఱితాచుఁ గాని
యనువుననుండుఁ గార్యాతురుం డింద్రుఁ
డదిగాక సామాన్యుఁడా నీకు శివుఁడు
మది నెంచఁ గాంచనాంబరునంతవాఁడు
విను చెట్టు గొట్టి పయిఁ వేసుకోరాదు
తనసత్వ మెదురుసత్వముఁ గనవలయు
నిది సుఘటంబు మీరి కార్యసరణి
వదలుకొన్నది మేలు వల్లభ! నాదు
మనవి చేకొనుమని మదవతి మ్రొక్క
ననవింటిదంట యానబోడి కనియె
భామిని! యీవట్టిభ్రమలేల? నీకు
కాముఁడు దేవతాకార్యంబు మానఁ
డేమైనఁగాని మున్ను యిభరాజయాన!
నామాట కెదురాడ న్యాయమా? యనినఁ
గానున్న పని యొదుఁగాక పోదనుచుఁ
బ్రాణేశు కౌఁగిటఁ బవళించె వేశ్య.

వ. అంత వింత మంతనంబునఁ గంతుండు

సీ. వలువంతఁదొలఁగించ వలదను వనితకే
ల్విడిపించి బొత్తిగా వదలఁజేసి
పలునొక్కులనుజిక్కుపఱవకుమని ప్రొక్కు
కుసుమకోమలి గజిబిజియొనర్చి
తార్మారుగానోపఁ దాళ రాయని వేడు
పడతి కేల్గవబట్టి పైకిదిగిచి
నీపట్టువదలవన్నిటఁ గొంటువనిదిట్టు
నువిదఁ పల్గిలిగింత నుబుకఁజేసి
గీ. చెదరు కురులెగదువ్వి చెలి చెమటవిసరి
మడుపులందిచ్చి హారముల్ మరలివైచి
హెచ్చరికఁదెల్పి తమిఁగొల్పిఁ పచ్చవిల్తు
డతివతో రతిఁదేలి సౌఖ్యముననుండె.

మాలిని. వననిధితనుజాతా వారిజాక్షీసమేతా
దినకరశతతేజా దీనమందారభూజా
ఘనఘననిభగాత్రా కంజమిత్రేందునేత్రా
వినుతసురవరేణ్యా విప్రగోభూశరణ్యా.

మేదినీవృత్తము.

జగదధీశ్వరా సన్నుతేశ్వరా, నిగమభాసురా నిర్జితాసురా
సుగుణరంజితా సూరిపూజితా, విగతదుష్కృతా వేదసత్కృతా.

గద్య ఇది శ్రీమన్నారాయణ చరణ దాస్యపవిత్ర, గోకులపాటి బుచ్చనామాత్యపుత్ర, శ్రీ తిరుమలపెద్దింటి సంపత్కుమార వేంకటాచార్యదేశికానుగ్రహసనాథ, శ్రీకూర్మనాథప్రణీతంబైన మృత్యుంజయ విలాసంబను శృంగార నాటకగేయ ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీరస్తు.

# మృత్యుంజయవిలాసము.



## ద్వితీయాశ్వాసము.



క్ష్మీక్షోణీసిలా
పక్ష్మలదృగ్రమణాలోకపాలనచణ! వే
రుక్ష్మాభృత్పతిధతిశశ
లక్షబ్రధ్నాక్ష భవ్యలక్షణనిలయా.

వ. అవధరింపుము.

సీ. పయనమేగెడు రతిపతి కొంటి బ్రాహ్మణుం
డెదురయ్యెనన శుక్రుఁ డుదయమయ్యె
దీనతతో రతిదేవి నెమ్మొగమట
చంద్రబింబము తొంటిచాయదప్పె
వలదీశుపగ నీకు జలజాస్త్రయనిదెల్పు
తీవి బహుద్విజారావమెసఁగె
హరకాములకు యుద్ధమగునంచు మెల్లన
జరిగెనా నక్షత్రజాతియడఁగె

సుమశరుని మూడుకన్నులఁ జూడదలఁచి
శివుఁడు మున్నుగఁ జంద్రాక్షి చేతఁజూచి
మించి రెండవకంట నీక్షించెననఁగ
నరుణమండల ముదయాద్రి నలరె నంత.

సురటిరాగం—త్రిపుటతాళము.

మదనుఁడు హరుని యాశ్రమమునకుఁ జనియెఁ॥ అనుప॥
మదవతితోఁగూడి త్రిదశేంద్రునివీడ్కొని॥ మద॥
కొదమరాచిలుకతురికి-గుఱ్ఱము ధుముకఁగ మొగలి
పదను కత్తిఝళిపించుచు-పంతములాడి కేరుచు॥మదను॥౧॥

క. అంతఁ గచకాంతికలితల
తాంతకసద్భృంగరవమహాగహనలతా
చింతితవధూకవధిక దు
రంతమగు వసంతమలరె నతకాంతంబై.

ద్విపద.

అలరారు లవ్వసంతాగమవేళ
నలమారవీరకాహళములో యనంగ
పరభృతంబులు గూసెఁ బల్లవకుసుమ
సరసకుంజంబులు స్మరకలంకారి
వని గుడారులనంగ భాసిల్లె నపుడు
ఘనతరాశోకము ల్గనుపట్టెసూన
శరకింకరులనంగ శాఖాగ్రపుష్ప
కరదీపికలచేతఁ గాంతిదనర్చె
మొనవిప్పి మొగ్గలు మొగిలిపూఁబొదలు
ననవింటి దొరగజనాళములనఁగఁ
బున్నాగకలితమై పుష్పవితాన

# ద్వితీయాశ్వాసము.

సన్నుతమై గురుజాలకామోద
భరితమైన రసాళిభవ్యమై చారు
తరగణికౌఘ సుందరమయి వీర
తరులచేఁ గపులవేదనవిఁబూవింటి
దొరమజాలీసుతౌ దొరమైనతోఁట
చెంతల పరుషుఁజేసిన తివాచీల
వింతిలదళబహువిధశూనరాశి
కుట్టి మతద్వనక్షోణిపైఁదోఁచె
నట్టివేళల కంతు నమితబలంబు
చలపట్టి, హరుని యాశ్రమదుర్గమెల్ల
కలకలమనుచు లగ్గలకెక్కెననఁగ
లోలాళిపికశుకాళులుకొన్ని కనక
సాలంపుకొమ్మల సందున జెలఁగె
నాలోన కాలికమైన వసంత
వేళ విలోకించి విభ్రాంతినొంది,
యాదిగాఁగల బుధు లాశ్చర్యమంది
రేదియుఁ దోఁచక యిదియేమటంచు
నిశ్చేష్టనుండెను నీలకంఠుండు
నిశ్చలమతి నుండె నిష్టఁబార్వతియు
కలవాణి నవమాలికయు మొదలయిన
చెలులతో వనకేళి సేయుచునుండె॥

సీ. ఒకవేళ నుయ్యాలలూఁగు ఖాలికలతోఁ
దన మంజుదోర్గతుల్దడబడంగ
సకి పూలచెండ్లాడు నొకవేళ మంజరు
ల్దనకుచమందిరు ల్తడబడంగ
నొకవేళ విరులుగోయును చాన సూనము
ల్దనలక్షిసూనము ల్తడబడంగ
నొకవేళ బ్రియుఁబాడు నువిదచిల్కలపల్కుఁ
దన జిలిబిలిపల్కు తడబడంగఁ
గప్పురపు గంధివని లోనఁ గలయమెలఁగు
గప్పురపుటనటిబో దెల నుప్పతిల్ల
కుప్పతెప్పలుగారాలు కప్పురంబు
దననగవు కప్పురంబును దడబడంగ.

వ. అంతనవ్వసంతలక్ష్మింగని కలవాణి నవమాలికలు తమతో
నిట్లనిరి.

కాంభోజిరాగం - ఆటతాళం.

సన్నుతాంగిరో వసంతునిచేజాల
వన్నెకెక్కె యీవనము॥ అనుప॥
చిన్నిజాబిలిదాల్చినసామి
యేకొమ్మనెన్నడు కరుణించునో ఓయమ్మ॥ స॥ ౧॥
కన్నెకనుంగొను కంతునియేచుఁగు
గున్నలలాగున్నగున్నమావి

గున్నలకేమిరో కొమ్మ! చూడె పోక
పొన్నాలనున్న యీపొన్నలచెన్నులు॥ స॥ ౨॥
మగువ ! గన్గొనుము నిమ్మగువిరిగుత్తులుఁ
బొగడఁదగినయట్టి పొగడలు
పొగడలకేమి యో పొలఁతి గను మరునికిఁ
దగియున్నయట్టి గేదంగిరేకుబాకులు॥ స॥ 3॥
తిలకించుమోయువతి తిలకనుసొగసైన
తిలకములివి ముద్దుగులుకునమ్మా !
తిలకములకునేమి కలికి! జూడవె
మల్లెకలికిమైవలచి చెంగటివానిఁబెనగెడు॥ స॥ ౪॥

వ. అప్పు డప్పుడమిదాల్పు దొర జొట్టియ యహో తడవయ్యెఁ బడుచు నెలదాల్పు యొడయనియడుగులకడ కరుగ లేదనినఁ గలవాణి కలకలనవ్వి, యిక్కఁటంబుకంఠి యతిసౌందర్యప్రకాశుండగు నీశుచెంగట మెలంగు నీకు మాబోటిబోటులతో మెలంగిన నేమి గల్గు నట్టి గట్టిబత్తిగలనీమీఁద మహాదేవుని యనుగ్రహంబేల? రాకుండు నెట్లయిన నతనిదయవచ్చి నంజాలు మేమును నదియకోరుచున్నయది నీమది నెఱుంగుదురుగాదె? యను నీవనమాలికకనుగొలిపి యెగగొల్పిన కలవాణి మఱియునిట్లనియె నోజవ్వని! యీనవ్వులమాటలకేమి నిన్నొక్కటడిగెద నాయెడదాఁచక తెలుపవలయు నద్దేవునకు నుపచారంబుసేయునెడ పుష్పాదికంబులందిచ్చునెడ నుత్తర

ప్రత్యుత్తరంబులు కరస్పర్శనాదికంబులు గలిగియుండునో లేక యూరక భావంబు లగపడకుండ నుండుదురో యనిన నప్పాటలగంధి చిడిముడిపాటున నేనెవ్వరికి బనులుసేయనోప మదీయజననిదరికరిగెదనని తుఱుముపీడ పయ్యెదకొంగుజీరాడబిరబిరనరుగునక్కరిగమసంగనిన మాలిక చెయ్యొడిం బట్టి మనకలవాణి నవ్వుమాటలకేమి తోటిబోటులు నగిన కోపగింతురే! హిమవంతుం డిమ్మహాత్మునకు సేవజేయ నియమించె గురునాజ్ఞ మీరుదురా? వలదురా! యనిబోధించి కళానిధిశేఖరుసన్నిధినుండ నియోగించి రంత॥

సీ. జడగట్టె నెరులుచిక్కడలింతునని చేర
గంగాతరంగ సంగతికి జంకు
తొడరినెమ్మెయిభూతి మడఁతునేననిడాసి
భుజగేంద్ర ఫూత్కారములకుఁ దలఁకు
గళనైల్యమళియని తొలఁగఁ ద్రోయఁగఁబోయి
ప్రకటకపాలమాలికల కులుకు
నకట! దువ్వలువలేదని కప్పగాఁజూచి
పులితోలు పచ్చడంబునకు వెఱచు
హారునియుపచార మిషమున నంటికొనగ
నాత్మఁదలపోసి తలపోసియళుకుఁజెంది
దైవగతిచేత పొసఁగక తాళఁగాక
యింతికేల్సోక మునినిష్ఠ లెట్లు నిలుచు.

మ. లలితంబౌమధులక్ష్మిహోలె మృదులీలం బాలశర్వాంగుళీ
గళితంబౌ స్ఫటికాక్షమాలికవహోయల్ గానీయచేఁబూనఁద
త్కళచేతంబవడాలవేరని యెదందాఁ దాల్చి, చన్దోయిపై
నళితంబౌ బలుముత్తెపుఁ సరము శేవఁ శూలిఁదేనుంచినఁ

శంకరాభరణరాగం—ఆటతాళము.

ఇది వేళగదయా హరునిగెల్వ నిది వేళగదయా॥ అను॥
ఇది వేళగదయనిమదనుఁ డదయతరుద్రు
నెడవాడఁ కోలలు గదియనేసెఁ॥ ఇది॥
సుదతినెన్నుదుటిపై చెదరుకురులెగదుప్వ
యెదపైఁబయ్యెఁదదీర్చి, యీశుసన్నిధి నిలిచి
కుదురుగానాలీఢపదుఁడై విరివింటఁ
గదియతుమ్మెదనారి బొదువఁజేసి
కొదమరాచిల్కబల్ ఘోటిపై దిగధుమికి
బొలుచుచులేమల్లె పొదలమాటున డాగి
బెదరక డాసి మొగలబాకు ముదమునదూసి
కేకలు వేసి ముదముతో కోకిలకదుపులు
రొదలుచేయుచు తెక్కకోపులు గదురగాఁబీరీనివదల క
కుదురుగా మాధవుఁడు నిలువఁగ॥ ఇది వేళగదయా॥

ద్విపద.

ఆనీలగళుఁడుపుంఖానుపుంఖంబు
గానేయుమదనమార్గణ జాలములకు

నోర్వక చలితేంద్రియుండయి యతఁడు
సర్వజ్ఞుఁడగుటచే సర్వంబుఁదెలిసి,
కనురెప్పలెత్తి చెంగటహారంగయిన
వనితఁ గనుంగొని వలపడఁగించి
ముందరనిశితాస్త్రములఁ జిమ్ముచున్న
కందర్పుఁజూచి కన్గవకెంపుదేర
ననుపమకోపుడై యీక్షేత్రయంబు
ననలమయంబైన యట్లుదీపింప
గ్రక్కునఁ దనమహోగ్రత తేటపడగ
ముక్కన్నుఁదెరచి కామునిఁ జూచుమాత్ర
భస్మీకృతుండయి పడియుండె మారుఁ
డస్మదీయాననంబగు గాకటంచు
నొకచోట నిలువక నుటికెఁజైతుండు
పికశుకావళులు పికాపికలైపఱచి
చెట్టొక్కపిట్టయై చెదరె దిక్కులకు
నట్టివేళను భీతి నాహిమవంతుఁ
డేమిచేయుదుఁ గూఁతురే మయ్యెదొక్కొ ?
స్వామికటాక్షమే సరణినున్నదియొ ?
యనివచ్చి; సూచి, యోయమ్మ, రాఁ? గదవె!
యనుచునెత్తుక వేగనరిగి మేనకకు
నప్పగించి ముదంబు నంది రా నిద్ద

రప్పుడు రతి గుండెలవియ మోదుకొని
సరులము త్రిమములు జిలజిలరాల
నెరికొప్పువీడఁ గన్నీరుకాల్వలుగ
ధరణిపైఁబొరలుచు, దరిలేనియార్తి
వెరవేమిదోఁచక విలపింపఁదొడఁగె.

శుద్ధవరాళిరాగం—ఆటతాళం.

మదన ! పూర్ణచంద్రవదన ! పద్మరాగ
రదన ! మామకచిత్తసదన హామదన॥ అను॥
కదనభీమ ! నీచక్కఁదనము ముక్కంటి
కంటిమంటలఁ గాలిగామెనా ? అయ్యయో॥ మద॥
నీవిటులయిన నానెమ్మేనునిలిచెను
హావిధి ! శిలజేసె నయ్యయో ! యీవేళత్రోడనేవత్తు
క్షణమోర్చు జీవితేశ ! నీచిత్తమువచ్చిన॥ మద॥
చిన్నవాఁడునన్నుఁగన్న బుధులుభాగ్య
సన్నుతురాలనిచాటిచెప్పిరిగాని
యన్ని యసత్యములయ్యె నిప్పుడు పెద్ద
లన్నమాటలెల్ల నయ్యయో !
అవు నేమన దుష్కర్మ మనుభవించువార
లెవరటులైన నింకేమిసేయుదాన॥ మదన॥

ఉ. నాయనుకూలభాగ్యసదనా! యను నన్నిడనాడనాయమా
నా? యనునిన్ను బాయగలనా? యనుయీవెతకోర్చుదాననే
నా? యను వేరుసేయఁదగునాఁ యను నోమదసామజంపుగు
న్నా!యనుపల్కవేమి?బదనాయనుఁనేబగదాననా!యనున్.

## ద్విపద.

హాసుందరాకార హారణశూర
హాసుకుమార యాహా! మేధీర!
హామార! హావీర! హామహోదార
సామి యేమోయి నాచనుదోయిగాని
పవళింపఁవీ నేలఁబడియుంటి విప్పు
డెవరికి మున్నిట్టిమొగ్గు జేసితిమొ
యదియిప్పు డనుభవంబయ్యెఁగాఁబోలు
మదికోపమై నను మంబులేవేయు
నీదయశాలికా యిటువంటిపాటు
హాదైవమా! యని యలిగి యిట్లనియె
శివునకుఁ గీడేమి చేసెదమంచు
శివుఁ గూర్పఁదలఁచుట చెడ్డతనంబె?
నదియును గమలాసనాబ్జచేఁ బిలిచి
త్రిదశేంద్రుఁ డాదిగా దేవతల్వేడఁ
బరహితార్థమునకై బాల్పడవచ్చి

సరసులు సురలు మచ్చరము లెక్కించి
మొరటను బెట్టి మమ్ముల బాగుసేసి
రరులుగాఁ గాపులే యక్కట ! వారు
నాఁడట్లు బల్కుసునాసీరుఁ డేడి ?
తోడువచ్చిన వసంతుం డేడి ? యహాహా !
నేఁడు పాతివ్రత్య నియమంబు చేత
మూఁడులోకములు నిర్మూలంబు చేతు
నంచుపశ్చాత్తప్తయై యంతలోనె
యనుపమసమపృథ్వి యమ్మహాసాధ్వి
బాధబెట్టఁగ నేల? పరుల నాకొఱకు
నాథుతో ననుగమనంబొనరించి
కైవల్యమందుదుఁగాక నీ యగ్ని
దేవుని బహుశిఖాదీప్తుఁగావించి
యెవ్వఁడు నిఖిలదేవేశుఁడై వెలుఁగు
నెవ్వఁ డేకారణం బీ విశ్వమునకు
నాయాదిపురుషు నవ్యయుని ననంతు
దోయజదళనేత్రుఁ దోయదగాత్రు
నారాయణుని వేడి నతులుగావించి
యారామశిఖరి యపుడుబోవంగ
హరు కృపచేఁ బల్కె నశరీరవాణి
తరుణిరో ! నీకు వైధవ్యంబు లేదు

అంగసంజాతుఁ డనంగుఁడై బ్రతుకు
నంగయుక్తుఁడయి యగపడు నీకు
ననిన సంతోషాత్మయయి రతిదేవి
యనుగమనము మాని యాత్మభాగ్యముఁ
జీవించి సుందరశ్రీలఁ జెన్నొంకు
జీవితేశునిఁగూర్చి చెలఁగుచునుండె.

వ. అప్పుడప్పార్వతి, మనోరథవైకల్యంబున ననన పరిమితపరి
తాపంబున,

సీ. తపముసేయుచును నా యుపవనసీమకు
బాలేందుమౌళి దానేల? వచ్చె
వచ్చిననేమి, యవ్వాసుదేవునిసేవ
కెలమి మాతండ్రి నన్నేలఁబంపె?
పంపినమాత్రాన పతియౌతఁ డనుచు నా
నెమ్మదిశూలిపై నిలుపనేల?
నిలిచినంతనె యేమి యలసెఁ? యా సర్వజ్ఞుఁ
డంతలో మరుని రూపణఁపనేల?

నకట! ప్రియునకు సిట వెగటైననాదు
చక్కఁదనమేల? ధనమేల? సౌఖ్యమేల?
సరసగత్రులేల? మతులేల చలమిదేల?
యనుచు నవనిబలుచింతగొనియెఁ గాంత॥

వ. అంతకమున్న పురాంతకుండు రతికాంత యత్యంతదుఃఖా
క్రాంతగావున కుపితస్వాంతమై యేమనునో? యను చింత
నచ్చెంత నిలువక కైలాససానుమంతంబునకరిగి, నిజశుద్ధాం
తంబునఁ గేళికాగారతల్పంబున వసియించి, యమ్మించుబో
డిం దలంచి, యిట్లనియె.

శ్లో. నానాగంధఫలీమృదూరుకదళీవాక్కోకిలాకాకలీ
దోలీఁలాలవలీశిరోజభసలీహాసప్రసూనావళీ
రాగాలీనకరాంగుళీ కిసలయస్వర్ణ ప్రభామండలీ
సాకేళీననిశాస్థలీ వనలితా కామస్యపీచీవళీ.

వ. అని మఱియు నిట్లనియె నటువంటివాల్గంటి నెడబాసి యిట
కేలవచ్చితి హాహా యూరకే పరాకై చిరాకైతి నేనారాకా
నిశాకరవదనకొరకేగదా హిమగిరికిరాక యట్టి నారాకనిరాక
రించక గట్టుదొరయు హితవుపుట్టి తనపట్టి నుపచారంబున
కనిపె ప్రేమ నాకోమలియుం మెలంగుచుండె నదిసమయం
బని యాజవరాలివశురాలిగా జేసికొనక నంగజునేల భంగ
పఱచితి పఱిచిననేమి మఱల నతండు దైవగతికొనసాగి తన
పగ తీర్చుకొనసాగె నయ్యో కరగతంబగు పదార్థంబువదలి
తినని యిట్లనియె.

సీ. అరగంటపూర్తిఁ గెయనుచు చూచితిగాని
సుదతికన్నులనిండ జూడనైతి
కేలంటిచిగురుసోకెనని యుంటినిగాని
యదిసేందు జేసి నే యలమనైతి
పలుకుచోఁ జిల్కపల్కులని యుంటినిగాని
యతివతో ముచ్చటలాడనైతి
నిష్టమేమన్న మోమిటులదిప్పితిగాని
పొంచియాపనుల కొప్పించనైతి
మోసపోయితి నిఁక వట్టియాస లేల
యాలలితాంగిగలయు భాగ్యంబు మిగిలె
వెఱ్ఱిజప మప్పుడేల పై వేసుకొంటి
మీఁదెఱుగనివారల కేదిసుఖము.

వ. అని యిట్లువిసుకంబడి మాటలాడి పునస్సుందరీదర్శనోపాయంబునకు జంతింపుచున్న యెడ భృంగి పరిహాసితాంతరంగి గావున నతనియంగవికారంబులతో బాడగని యుడుకని వెత నిట్లనియె అయ్యా యెన్నడు లేని దిట్లు చిన్నవోయినయున్కి కేమి హేతువు నాతో సెలవీవలయుననిన మినుక దేవర యిట్లనియె మోరీ యోగిరికుమారీమణిని మరల నేరీతిగం దురా అయ్యిందువదన నెడబాసినది మొదలెదదిగులుదీరదు యే వేళ నాకన్నులగట్టినట్టున్నది యేమిసేయుదు ననినవాడు గుండెజరుచుకొని అబ్బాయ బ్బాలికముద్దరాలనియుంటినిగాని

వడిగ యిదినాఁడు వెళ్లఁగొట్టిన నింతపనిఁబుట్టనుగదా సామీ! యింతియకాదు. అదిమహంకాళసత్తికాఁబోలు గాకున్న నచ్చటినుండి యిచ్చటికేల పాడకట్టు నిన్ని బాముల నేలఁబెట్టుఁ దేవరా! మీరేమన్నా అన్నారుగాని యింతటఁబోదే మిమ్మున బట్టనున్నదియంతకంతకు మీమేను నగంబుసేయుననిన నోరి! మేమటకానిదాని జూడకనిమిషమయిన తాళఁజాలరా యది గనుక యెరుకవేషంబుతోఁ జూచివత్తుననినయ్యా! మీసేవకు రాలిలాగు నేను వెంబడివత్తుననిన వోరి నీవునక్కడ వెఱ్ఱి ముఱ్ఱిచేష్టలుచేసిన భంగమునుమీయనినమన బ్రతుకే వెఱ్ఱి ముఱ్ఱియైయున్నది యింక మంచి చేష్టలేడవచ్చు సామీ! యని పయనమయిరప్పుడు.

ద్విపద.

శివుఁడప్పు డాత్మీయచిహ్నముల్ మాని
నవతనూధవళిమ నగవునఁబూని
కరకురంగాకృతి కడకంటనిలిపి
తరుణేందుకళఫాలతటిఁగీలుకొలిపి
గళనీలచకచకల్ కచపాళినాటి
వళుల గాంగతరంగవైఖరిమాటి
తనయిష్టమూర్తులందంబు గైకొనక
దనయొద్దనేయుంచి దనరెనోయనఁగ
పృథివిమహత్వంబు పిఱుఁదులయందు

పృథుతరసరసతఘ్రాదయంబునందు
బంధుర తేజంబు వా తెరయందు
గంధవహత్వంబు కాయంబునందు
గగనగుణంబు సైకపుకొనునందు
తగుజలజా ప్తత తన ప్రాణులందుఁ
జెన్నగుజాబిలిసిరి మోమునందుఁ
బున్నాగరూపంబు పొక్కిలియందు
నిరవొందభువన మోహినియైనపరమ
పురుషునిరూపంబు పొందుగాదాల్చి
కలికిబంగరుపూల గాజులుదొడిగి
గిలుకుమెట్టలు వ్రేళ్ళఁ గీలించి చెవులఁ
గుచ్చులబావిలీల్ గుమ్మటీల్గరుడ
పచ్చలబొగడలు బవిరలు గుల్క
ముక్కున బలుకెంపు ముక్కెర చెలఁగ
పెక్కురత్నము పూసపేరు జెన్నొంద
శిరమునరత్న భాసిత పాత్రఁబూని
మెరికతమైవచ్చె హిమశైలమునకు.

సావేరిరాగం—ఆదితాళము.

అత్తజీమెరికతమై బొందియరుదెంచెభృంగీ॥ అను॥
బత్తితోడ మ్రొక్కు కొంటమి త్తిగొంగ వెనువెంట॥అత్తరి॥
నెత్తిపైఁ దాటాకులబుట్టనిలిపి, గాజుపూసాల

## ద్వితీయాశ్వాసము.

మొత్తములువైచి సొట్టముఃక్కర వెలుగ
యిత్తడికమ్మలు చెవులహత్తించిన పతిఁదిట్టుచుఁ
గొత్తగ నల్లినగిలుక గుత్తులువాయించుకొంట॥ అత్తరి॥

వ. ఇట్లు భృంగిశివుని యోగంబునఁ బార్వతీభవనంబునకరిగి బిచ్చా
నకు వచ్చిన యెరుకలదానివలె నేమనుచున్నది.

సౌరాష్ట్రరాగం - ఆదితాళము.

అవ్వోయవ్వ మారాజవేయవ్వ
భాగ్యంగలిగినే యవ్వ
పాడిపంటలుగలిగినే యవ్వ
సిరిగలతల్లివే యవ్వ
కొడుకులకోటవేయవ్వ
చుట్టాలసురభివేయవ్వ
బంధువులభాగ్యవంతురాలవే యవ్వ
అమ్మవారమ్మవారమ్మవారు
జగదమ్మజగదమ్మజగదమ్మ
నీబంగరుకాలికి మ్రొక్కేనే యమ్మ
అమ్మా! దోసెడుముష్టిబుడ్డిగాడికిపట్టెడుముద్దబెట్టవేయవ్వ
పోడిగాడు నీపై చాలాభక్తిగలిగి
జుమ్మజుమ్మని వస్తున్నాడు
నీరొట్టె నేతబడనున్నది
నీకార్యం గట్టెక్కనున్నది.

వ. యనిన విని యానగరాజనందన యీయెరుకలదాని కొన్ని మాటలడుగుదమని వచ్చి యిట్లనియె.

సౌరాష్ట్రిరాగం—ఆటతాళము.

ఔనెరుకలదానా
నీవడిగినట్లు యిచ్చుదాన॥ అనుప॥
మానక నేనొక్కమాట యడుగనున్నదాన నీవది
నిదానముగ జెప్పు॥ ఔనేయెరుక॥

వ. అనిన నమ్మాయెరుకత యిట్లనియె నమ్మా నాకు యెరుక జెప్పుందోఁచదు మానాథుండు నన్నును నాసవతులైన యనేకగణంబులనొల్లక జాలిమాలియొక్క కొండవారి చిన్నదాని దగులుకొఁదలఁచిదలఁచి తిరుగుచుండె నేనును వానిఁ జూడనేవచ్చినదాననై నను సూసాయలేకాని మిక్కిలి నిదానంబుగాఁ జెప్పనేమా యెరుకలసాని యీసామిప్యంబున నున్నది. ఆమె నీకు పత్తెచ్చంబుగానన్నియుఁదెల్పునని నీవొక్క చెలింబిలిచి శీఘ్రంబా యెరుకలసానిం దోడ్కొని రమ్మని పనిచిన నది యతిత్వరితజగతింజని యేమనుచున్నది.

సౌరాష్ట్రిరాగం—ఆటతాళం.

నీవటమ్మా యెరుకలసానివీ
నిన్నుఁ బిలిచెనోయమ్మ మాయమ్మ॥ అను॥
రావమ్మ యెంతోరాజసమమ్మ
మహావేగమేరమ్మని
యంపెనమ్మా మాయమ్మ॥ నీవటమ్మా॥

సావేరిరాగం—ఆటతాళము.

ఎరుకలసానివచ్చె నెరుకను॥ అను॥
ఎరుకలసానివచ్చె నెరుకో యెరుకో యెరుకోయనుచు॥ ఎరుక॥
మురిపెంపువడలతోడ ముంగురులల్లాడ
సరసంపుమాటల చతురతతో
సిరమున నవరత్నఖచితమైన బుట్టబెట్టి
మేరుపువలెను మేను మెఱయఁగను॥ ఎరుక॥

వ. ఇట్లువచ్చిన యెరుగలసానింగని పార్వతి తదీయ సౌందర్యాతిశయంబున కత్యాశ్చర్యంబునొంది, యుచితరత్నపీఠంబున నుండ నియమించిన నక్కపటప్రబోధిక యిట్లనియె.

కాఫిరాగం—ఆటతాళము.

ఎరుకవారుగల రెందరైనమా
కెనవత్తు రేరమణీ॥
మఱియును నీవింకమున్నున లోకసా
మాన్యముగాఁజూడకె యోదేవి॥ యె॥
సరసిజభవురాణి పరిణయమాటమా
యెరుక నెగాదటవె సురపతిపౌలోమిశోభనకృతిమా
యెరుక నెగాదటవె యోదేవి॥ యె॥
గరిమతోమూడులోకముల కార్యములు
మాయెరుక నెగాదటవె
తరుణినీమదికి నేఁ దార్కాణముగాఁ జెప్పితగు
కోర్కెలందెదనే యోదేవి॥ యెరుక॥

ద్విపద.

అంగనయామాట లాలించి వేడ్క
బంగారు చేటలోపల ముత్తియములు
ముమ్మారు తనకరాంబుజమునఁబట్టి
సమ్మతి ఫాలదేశంబున నిలిపి
మ్రొక్కి యిట్లనెఁ జిత్తమునఁ దలపోసి
మిక్కిలి కంటిసామికిని నామీఁద
నెన్నఁడు దయవచ్చు నెపుడు పెండ్లాడు
నెన్నఁడు నాకోర్కెలీడేరు ననుచుఁ
జేతిముత్తియములు చేటలోఁబోసి
నాతియం దిచ్చెను నగుమోముతోడ
నామెరుకలసాని యాత్మ దైవముల
బాయనిభక్తితోఁ బ్రస్తుతిచేసె.

సౌరాష్ట్రిరాగం—ద్విపద.

సామిసీయప్పతి సక్కరధరుఁడు
దామోదరయ్యయో దైవాలరాయ
వేదాలుబమ్మకు యిచ్చినతండ్రి
మాధవరాయఁడ మమ్మేలు వేల్పు
భూదార రూపంబుబొందిన సామి
ఆదినారాయణ యఖిలాండకోటి
బ్రహ్మాండనాయక భక్తరక్షకుఁడ

సిమ్మాద్దిర రప్ప శ్రీకూర్మనాథ
నల్లనదేవర నాముద్దులయ్య
తెల్లనినామంబు దిద్దినసామి
నీకుమ్రొక్కెదనయ్య నీలాద్రినాథ
జోకతో నాకన్నిఁ జొప్పడఁదెలుపు
బెజవాడలోనున్న పేరయినదుర్గ
యుజ్జయినీకాళీ వోయాదిశక్తి
నిఖిలేశి నారాయణీ భద్రకాళి
యిజయ శాంకరి శాంబరీ మహాదేవి
మాయాపురీశుని మరిగినదేవి
వోయాదిలచ్చిమి వోలోకమాత
వోడక నీయెడనొప్పారగాను
తోడునీవై మాకుఁదోడు గావలయు
నోబమ్మ యిల్లాలవో సరసతిలక
వోభారతీదేవి వో పలుకుమాత
పరగంగ నాజిమ్మ బాయక యుండి
వెరగొందకుండఁగ వృత్తముల్ నుడువు
యిగనాలఁదొలంగించు యిగనేశరుఁడ
సగినాలుతెస్సగ సాగంగఁజేయ
నుల్లంబులోనిల్వఁ డోజేజెలార !
కొల్లాపురిదేవి గోరెదనిన్ను

కాశియొద్దనెయుండు కాలభై వృడ
ఆశించి యీదుండియాత్మలోపలను
వాటిల్లుమేల్ తలుపు లోటుగాకుండ
సూటిదప్పకయుండ సోద్యంబుగాను
యీకాంతమనసు నాయెడవచ్చునట్లు
వాకియ రేనాడు వాక్కునవిలిచి.

వ. అని యిపుడు యెంటివాల్గంటి నంటితినని కేలుగీలించి యేమ ని యెరుకచెప్పుచున్నది. అహోదేవి భాగ్యంగలచెయ్యి ప్రతిష్ఠగలచెయ్యి సంతానముగలచెయ్యి చల్లనిచెయ్యి అహో దేవీ యొక్కతలంపుజేసినావు యొక్కకోరికనడిగినావు యొక దొడ్డమేలడిగినావు అది కాయో పండో కల్లో నిజమో అవునో కాదో జేకూడునో చేకూడదోయని వెనకముందు తొక్కుడు పడుతువున్నావు. అది కాయగాదు పండు కల్ల గాదు నిజము. శీఘ్రించె యింతలోనే చేకూడుతున్నది. అది యేకోపు కార్యమంటె యీకోపు ఆడవారివంక తలంప మొగవారివంకతలంప అంటేయిదుగో మొగవారంటేగడ్డము ఆడవారంటే వక్కాకు యిదుగో నీయెడలో తలంపు యెన్నా ళ్ళకంటె వకటే రెండే మూడే. వకటంటే వకయేడుగాదు రెండంటే రెండేడ్లుగావు మూడంటే మూడేండ్లుగావు శీఘ్రిం బె యింతలోనె చేకూడుతున్నది. ఇంకదాపేల కోడిగాడితో తక్కిరబిక్కరలాడుకుంటా కులకనున్నావె అప్పుడు నన్ను

మెచ్చవే కోర్కెలిచ్చేవే దేవి యిపుడు నీ నాథుండు నాకుఁ బొడకట్టి నామేనువణఁకుతుంది. చెమట బెట్టుతుంది. పులకరిస్తుంది నీకు కనుపించఁడు గాన నీకు నాథుండనమ్మేదనని యిప్పు డిచ్చటనే యున్నాఁడు. నీపైఁ జాలాదయవచ్చింది. శీఘ్రింబే పెండ్లియాడు. నీకోర్కెచేకూరు నమ్ము నాబుట్టతోడని మరియు నమ్మించి చెప్పిన.

ద్విపద.

అంత నమ్మింతి యింతింతనరాని
సంతోషమంది యాశ్చర్యంబునొంది
యిదియేమిరారొకో యోకతలెందు
మదికిదోఁచినయట్లమతికొన్ని కొన్ని
ముచ్చటల్ దెల్పరో బ్రొక్కినే నడుగ
నచ్చునఁబొడిచిన ట్లన్ని యుఁజెప్పె
యెరుకలసానిగాదెన్న నాపాలి
హరకృపమూర్తియై యవతరించినది
యిచ్చెలిమెచ్చ నేనేమిచ్చుదాన
నిచ్చెడెకు జగంబు లిచ్చినఁజాల
వనితమౌక్తికహారంబు కంఠ
మునవైచె మల్లెపూమొగ్గలదండ
వరునిపై వరియించివైచెనోయనఁగ
మఱియును నవరత్నమయభూషణములు

విలువలేనివియిచ్చి విడియంబొసంగ
వలికిజరీబాబు వలువలొసంగి
తగినట్టివియనోప దయయుంచుమనిన
నగుచు నయ్యేరికత ననబోడికనియె
యిపుడేమి నీతలంపీడేరిచెలఁగు
నపుడు నాదేకదా యాభాగ్యమెల్ల
నన నట్లయగునని యయ్యెరుకతాను
వినయ వాక్యములచే వీడ్కొల్పెనంత.

వ. ఇట్లపరిమితకృప చపలనయన యెరుకలపడఁతి వీడ్కొలిపి యేగతి పశుపతి పతికాఁగలఁడనితలంచి తపంబుననేకాని యిక్కార్యంబు సిద్ధించదని నిశ్చయించి నిజాయాసాసహిష్ణులగు జననీజనకుల నెట్టకేలకొప్పించి వరయోగార్థంబు వరయోగంబువహించి మత్కుచకర్కశతకీవలి పెమణం గెట్లు సహించు నన్నట్లు వల్కలాంబరంబులు ధరియించి చూతమెట్లు సంపెంగదండ నుండవోయని గండుతుమ్మెదల మెద లకుండఁగట్టి పడసైచినట్టు జడిలోడలెల్ల నలమరచియించి యగణితశిఖి నినాదముఖరంబగు గౌరీశిఖరంబునకేగి యందు ఘోరతపంబుసేయుచున్నంత.

వర్షాకాల వర్ణనము.

సీ. స్తనితారవార్భటీ జనతాతిభయవధూ
జనతాస్వయంగ్రాహ వినుతజనము

శరకాంతధారానికరకాంతమౌక్తికా
కరకాయమానభాకారఘనము
అవనీధరస్థలన్నవనీరబహుళఝరీ
జవనాపతద్దరీభువన వనము
విపులావియన్మధ్య విపులాభపరిపూర్ణ
చపలప్రభీతాహిచపలమనము
యఖిల సస్యావనము మయూరౌఘజీవ
ధనము పాంథమనోవిభేదనముజపల
తనము భూదేవతకు చల్లఁదనమునగుచు
ప్రకటగతిమించెనంత వార్షికపుదినము.

వ. ఇట్టి వర్షాకాలంబున గట్టుదొరపట్టి బట్టబయల నితంబాచలాలంబివేణికాదంబికాకలితవిద్యుల్లతాలలితయైయుండి వర్షధారలు శిరంబుననుండి పయోధరంబులంబడి కడవలం ద్రిమ్మరించిన ట్లురల చలింపక నిలింపుల కశక్యంబగు తపంబు సేయుచున్నంత.

సీ. పరపైనమంచుతుంపఱకుబుట్టినయిల్లు
కమలపాళికి మారకగ్రహంబు
చలువపస్నీటి కుచ్చాటనమంత్రంబు
బీదలవణకింపఁ బెద్దమొకము
చెలువలకుచదుర్గములకుఁబిరికిబంటు
పృథువస్త్రవితతికిఁ దృప్తికరము

మేడతలుపులుదీయఁ గూడనిముట్టడి
　　　యినహారుల్ పరువెత్తవెనకతరిటి
ఓష్ఠకంపమ్మృషామంత్రము లుచ్చరించి
సమిధ లనలంబులందుంచి జ్వాలసేయు
పసుల దంపతులెడవాయ కునికిజేసి
క్రతువిధియనంగ హేమంతఋతువు దనరె.

వ. ఏతాదృశశీతాకాలంబున శాతోదరి సహోవరంబునఁ గంఠమగ్నంబగు జలంబుననుండి నిండుజందురుండు పుండరీకంబుల చండణంపగ వచ్చినట్లు స్మితకౌముదీసదనంబగు వదనంబు వెలుంగ నతినిష్ఠురంబగు తపంబు సేయుచున్నంత.

సీ. భీషణప్రభ ప్రజపీడబెట్టుట చేసి
　　　రవిమిత్రభావంబు రాజు జేరె
జనులకు కాల్ నిల్ప శక్యంబుగాకున్కి
　　　ధరణికనంతాఖ్య దట్టమయ్యె
తనునార్పు జలనామధరము కానని యేమొ
　　　దహియించె వనములదావవహ్ని
గిరినిర్ఝరంబు లింకినవాట తద్గత
　　　శైత్యము లవనితల చంటదాగె
బవలు జలకేళి, వెన్నెల బయిలరాత్రి
హిమ జలార్ద్రిపటీర పంకముల చేతఁ
గాలమొకరీతి భోగులు గడుపుచుండ
భీష్మగతితోడ నరుదెంచె గ్రీష్మఋతువు.

వ. ఇట్టి బెట్టిదంబగు వెట్టకాలంబున గట్టుదొరపట్టి యిట్టిట్టనరాని బీరంబునఁ బంచాగ్నిమధ్యంబుననుండి తరగనిపదియారువన్నె కుందనంపుసలాకపోలిక మహాతపంబు సేయుచున్న సకల లోకంబులు భయోద్రేకంబులై గడగడ వడఁకునెడ నా యొయ్యారిచెంగటికిఁ బురారి బ్రహ్మచారియై వచ్చె నఁటయెటు వలెను.

ద్విపద.

అళికభాగమున నొయ్యారంపువర్ణ
నలదగునూర్ధ్వపుండ్రము బెట్టిహస్త
తలముల పాలాశదండమ్ముబట్టి
కలితమధ్యమునఁ జెక్కని మౌంజిఁజుట్టి
బలువన్నెగులికెకు పావలుమెట్టి
సలలితంబైన పచ్చని గోచివెట్టి
పొలుపొందఁ బుస్తకంబు మృగాజినమునఁ
గెలఁకులవచ్చుభృంగికినెత్తిఁబెట్టి
పదియునారేఁడుల బాలుఁడై నట్టి
యుదయార్కుఁడననురుద్యుతుల గనుపట్టి
వామనుండగు జగద్వల్లభుపట్టి
వామదేవుం డప్పుడు వటుఁడయివచ్చె.

వ. ఇట్లు వచ్చివచ్చి యచ్చట పరమపావనంబగు గౌరీతపోవనంబు గాంచి యందుల శుకపికాళులను విందులగు మాకందకుంద

బృందచందన పిచుమంద మందారాది తరులదరుల తిన్న ని సురపొన్నగున్నల నీడలజాడల కిసిమిసి తీవలత్రోవల నెత్తమ్మి కొలంకుల కెలంకుల వచ్చివచ్చి యచ్చేడియ జపావసానంబు నమిత ఫలాహారంబొనర్చి మేలిమి వన్నెడాలు జీరాడ పయిం జేర్చి,యిష్టసఖులతో గంగాతరంగిణీసమీపరంగన్మణిగృహాంగణంబును గురంగధరకాంతకుట్టిమ క్ష్మాతలంబున విశ్రమించుచున్నయెడ నక్కన్నియం బొడగాంచి యబ్బురంబున ననురాగంబును గుబ్బకొన సర్వజ్ఞుండయ్యును మోహాంధకారంబునం దెలియక నిట్లని వితర్కించె.

శ్లో. యదజ్యంధనుర్భ్రా మిషంతే నవీష్వా
శరాళిం కిరంతీస్మరంజీవయంతీ
మనఃపశ్యతోహారిణీ మే విలాసా
దియం కాస్వయం కామమాయేవభాతి.

శ్లో. కిము లతాలలితాగమనాంచితా
కి మధరారుచిరా చిరరుగ్వరా
కిము కలావికలాశశినఃకలా
కిము ఘనాపఘనాజలజాననా.

శ్లో. కుచజితసురాలయేయం
వితతనితంబవిలాస వంచితోర్వీః
వేణీహతాహిమధామా
ప్రాప్తా చేత్కామినిత్రిభువనైఃకిమ్

# ద్వితీయాశ్వాసము.

శ్లో. న స్థూలా నాతికృశా
నహిదీర్ఘా నాపివామనా
లలనేయంకలితాతుయథాకామం
మచ్చిరకృతభాగ్య హేతుతపసైవ.

ఉ. కన్నదిలేదు యిట్టికలకంఠి నొకప్పుడు దిద్దివేసి న
ట్టున్నదిముక్కు చెక్కుఁగవ యొప్పిదమార! మెఱుంగుదోమిన
ట్టున్నది సోగకందళుకుటొయ్యర మేమనవచ్చు నైన యీ
చిన్నది తుంటవింటి దొరచిల్కయొముద్దులుమూటగట్టెడిన్.

ఉ. చన్నుల పొన్నకాయలకుఁ జక్కదనంబు లొసంగుకల్కి వా
లన్నులు గండుమీలకు నిగారములిచ్చి నయారెదీనికే
యన్నలుసాటికాగలరుహా యొకమాటటు జూచినంత నే
వన్నులుకంగ జేసె రతినాథుఁడు నైజధనుర్గుణధ్వనిన్.

చ. కలకలనవ్వునెమ్మొగము కంచెల నీటెదమీటుగబ్బిగు
బ్బల బలవంతపుం బోగరుబంగరురంగు మెఱుంగు చెక్కులుం
దళతళలీనుమై మొయిలనందగు నందపువేణి దీనితోఁ
గిలకిలలాడుచున్మదనకేళిఁ బెనంగెడి భాగ్యమెన్నఁడో.

ద్విపద.

అవురముద్దుగుమ్మ యపరంజిబొమ్మ
చివురువిల్తునిముల్కి చిల్కలకొల్కి
కలికిపూఁదెప్ప చక్కఁదనాలకుప్ప
తళుకుల దొంతికందర్పునిదంతి

కలువలచెలిరేక కనకశలాక
తలిరుటేమొక్క మేల్తళుకులచుక్క
కమ్మని పూచెండ్లు గజనిమ్మపండు
తమ్మిపూదేట యందమ్ములమూట
కాయజుతోట బంగరువన్నెతేట
సోయగంబులవిందు చొక్కులమందు
గోరవంకనెలకూన కులుకులసోన
తరుణీలలామ సౌందర్యాభిరామ
జలదమేచకవేణి జలరుహపాణి
సలలితపికవాణి సైకతశ్రోణి
బాలేందుఫాల దర్పణసత్కపోల
లీలాలవాల లాలితదంతచేల
నవమందహాస సుందరతిలనాస
యువిదలలోమిన్న యొయ్యారికన్న
కన్నులకలిక చక్కని గుబ్బలాడి
యన్నన్నమాధుర్య మహహా! లావణ్య
మెన్నఁగాశక్యమె? యెవ్వరికైన
కన్నదివిన్నదిగా దీయొయార
మీముద్దుమొగమేమి యీసొబగేమి
యీమేనుబంగుబన్నేమి శెబాసు
మేలుభళీ! యంచు మెచ్చిసొక్కుచును

యేలీల నీబాల నెనసెద ననుచు
నతినిష్ఠతోడ మాయావటుడయిన
శితికంఠు డబ్జాక్షి జేరంగనరిగె.

అప్పు డప్పార్వతి జెలికత్తె లతనింగని యోబాలా! నీపాలి సాంబశివుండునుంబోలె మహాతేజోధారియగు బ్రహ్మచారి యేతెంచె; మహాత్ములువచ్చిన పరమలాభంబని చెప్పుమరుగావున నోయక్కా! నీవితనికి మ్రొక్కి యితనిచేత దీవనలందుమనిన, నగుఁగాక యని యుచితసత్కారంబులుగావించి సముచితాసనంబు దెప్పించిన నక్కపటవటుండు శీఘ్రంబె వివాహసిద్ధియగుంగాక యనిదీవించి సుఖాసీనుండై యిట్లనియె.

సారంగరాగము — ఆటతాళము.

ఎవ్వారిదానవే బాల
నీవిట్లుతపముసేయ నేల॥ అను॥
జవ్వనినీకోర్కె సఫలముగఁ
జేయజాలుదు దెలుపు మీవేళ నోబాల॥ యె॥
కన్నియనీకుపేరేదె
యెవరిచిన్నదానవో దెలుపరాదె
వన్నెవాసిగలవారి పడుచువలె
నున్నావు యీతోట నున్నకారణమేమి॥ యె।
[illegible]ల న్వడదాకు మేను
వహాపాటఁ బెట్టుటమాను

కన్నులకింపగు కలువపూవులదండ
యున్నతతపమునమంచి నెట్టోర్చు॥ యొ॥
ఎన్నంగ వనదేవతవో
లేక హిమగిరి ముద్దులసుతవో
అన్నిసొగసులునీ కలరారె నీరీతి
యున్నట్లుదెలుపవె యో ముద్దుగుమ్మ॥ యొ॥

చ. నెలతుకసిగ్గునం దెలుపనేరక యూరకయుండి బోటి యా
నెలకలవానిగన్గొనిన నెచ్చెలి యిట్లనె నో మహాత్మ! యి
య్యలికచ శైలనందనయుమాఖ్యఁదగుణ్ శివుఁబెండ్లియాడఁగా
దలఁచి తపంబుసేయు నిదె తథ్యముగా నిటు విన్నవించితిన్

ద్విపద.

అనినఁబక్కుననవ్వి యాబ్రహ్మచారి
యనురక్తిగదుర నిట్లను నుమతోడ
నెక్కసెక్కెము నిక్కమేపల్కునదియొ
యక్కట హరుఁబెండ్లియాడెదననుచు
నేలాగుదోఁచె నీ కిటువంటిబుద్ధి
బాలరో నీబుద్ధి బంగారుగాను
కినుక నిన్నిట్లు భంగించెరెవ్వారొ
వినవెయాభూతేశు వృత్తాంతమంత
కులగోత్రములులేవు కుక్షింభరుండు
మెలనాగరో బిక్షమెత్తుచుఁదిరుగు -ను

నెవ్వరుముట్టని యెముక లేదాల్చు
నవ్వ కా దయమెు మానవిహీనుఁడతఁడు
బట్టగట్టఁడు వెఱ్ఱిబాగులవాఁడు
యెట్టికర్మమొ బూడిదెఁ బూసుకొనును
యెుకపౌరుషము సేసెనో ముద్దుగుమ్మ
యకటకటా! బ్రహ్మహత్యగావించె
బహుతామసపువాఁడు పరమధూర్తుండు
సహవాసము పిశాచంబులతోడ
నేనేమి సెప్పెద నీవెభావించు
ఏనుఁగా ? గుఱ్ఱమా? యెద్దెక్కుటేమి
రోదనకరుఁడౌఁట రుద్రాఖ్యవచ్చె
నేదిచూచిన శుభవిఁంచుక లేదు
నీసోయగమునకు నీభాగ్యమునకు
నీసరసత్వగణితగుణంబులకు
నెంతచక్కనివాని నెంచుకొన్నావు
యింతిరో చూడవా ! యెగదిగకన్ను
లాబాల్లి మే నేమి యాయంద మేమి
శాబాసు శాబాసు చిత్రమయ్యెని
యలరారు మేడలో హంసతూలమునఁ
బొలుచు నీ వలరుద్రభూమి నెట్లుందు
వహహా ! యెట్లబ్బు గాఢాలింగనంబు

లహులపేళ్ళుబ్బు నీమూరుపైఁగినుక
హరిహరీ! విషదగ్ధమగు వానినాల్క
సరసంపు వాతెరచవిగొనుటెట్లు
తెలియకంటివి చేదుదిన్నట్టివాఁడు
లలనరో ! యింతబెల్లపుముక్కకొఱకు
శ్రీరామరామ యీ చెఱుబుద్ధిజెప్పి
రోరామ యెవరు నీ యుసురోసికొనిరో
పంకజాక్షిరో! మసిపాతమానికము
కొంకక కాకిముక్కున దొండపండు
కట్టినట్లగు నింతకంటెను బుస్తె
గట్టుకోమేలుచక్కనిస్థాణువయిన
నగుభాగ్యనియిది నమ్మునామాట
తగదు నీ కతనికిఁ దరళాయతాక్షి!
నేనైతెమటి జితేంద్రియుండనేకాని
నీనిమిత్తమ్ము పెండ్లికిని నొప్పెదను
స్వాధ్యాయమెల్ల క్రమాంతంబుగా
నధ్యయనాధ్యాప నాదికంబయ్యె
బ్రహ్మచారిని లోకపావనాత్ముండ
బ్రాహ్మణుండను బీదబాపఁడగాన
హరికృపగల్గ సర్వైశ్వర్యములును
కొరతలేదిప్పుడే కొండనెక్కెదవు

యిపుడేమి జెప్పెదు నీమేనునీది
తపముజాల్లెమ్మ నాతరుణివిగమ్మ.

సీ. అనవుడు బలువైన కినుకతో నట్లను
వనజాక్షుభక్తుండు వర్ణించయనుచు
బూజగావించితిఁ బురుషోత్తమాంఘ్రి భ
క్తులు మహాశాంతియుక్తులుతలంప
కలనైనఁ బరనింద గావించి వినలేదు
గావున వీఁడు మాయావి నిజము
శివు శంభు యీశ్వరుఁ జిన్మయాకంమని
నిష్కళంకుని వీడు నిందఁజేసి
బ్రహ్మచారిగాఁడు పరమకామాంధుండు
బోటులెల్లఁ దగ్గ బుద్ధిజెప్పి
వీని నిచటనుండి వెళ్ళగొట్టుఁడు శీఘ్ర
మనుచు లేచె సిగ్గునను నెలంత.

చ. తొడ నునుతళ్కులుప్పతిలఁ దొయ్యలు లయ్యెడవల్వవెన్కకై
ముడిచిపయింటలోవికచమల్లె ఘటింపుచుఁ బోకముల్లె క్రొ
మ్ముకులుబిగింపుచుం బొమలు మళ్ళిడిపెళ్లున వేషధారియా
వడుగున యివ్వడి న్గవయవచ్చినఁ గన్గొని భృంగి యిట్లనున్.

కన్నడగౌళరాగం—ఆటతాళము.

ఏమిసేతు దిక్కెవ్వారు నీకింక నయ్యావారు
యిదుగో కామినిభూతాలగతి వెంటబట్టెరయ్యావారు

ఎందేలనరుగక నిందేలవచ్చితిరయ్యవారు
వచ్చి పొందుగనుండక పోకెళ్ళబోనేల నయ్యవారు॥ ఏ॥
బులుపుదీర్చి నిన్ను పొంకక బెట్టకపోరయ్యవారు
ఇందునిలువగరాదింక నేనెందుజనుదునయ్యవారు
వదలరు నేదొడ్డబ్రహ్మచారినన్న నయ్యవారు
మిమ్ము పదిలపరచి వీరు భంగపెట్టకపోరయ్యవారు॥ ఏ॥
పదము వడిగనేబట్టిన తాళలేనయ్యవారు
యీమదవతులోనరించు మర్దన కెట్లోర్తు నయ్యవారు॥ఏ॥
భ్రమలేలవనితల పాలైతివయ్యయో అయ్యవారు
యింక-సమరసమునవాకు జమెవరు జెప్పెదరయ్యవారు॥

వ. అని వగల నెగడు భృంగింగని యంగనలుకనలి మొఱలుపెట్ట కుండ ముందర పీనింబట్టుకుందమని దగ్గర చీకాకుగావించిన వాఁడు ఇవి; యయ్యవార్ పుస్తకంబులు, వీడిపోయినంగడు చిడుముడిపడుజుమీ యిదియయ్యవారి జపాసనంబు ముట్ట కుండుము కట్టువిడిచిన బెట్టిదంబగుధావంతంబులు జుమీయ నినవారు వికవికనగి యిక నీయయ్యవారికివచ్చుపాట్లు జూచెద వనిమఱియు వడికొనినవాఁడు మొఱలుపెట్టుచు మీపుణ్యంబు వమఁగుండని యినుమునగూడి యగ్గికి సమ్మెటపెట్టన్నట్టు ఈ యయ్యవారినుండి నాపనిబాగాయె నీఅయ్యవారియొద్ద జదు వవచ్చిననాటనుండి ఓం నమశ్శివాయయన్న ఈమైదాఅచ్చ రంబులయినను కుదురజెప్పలేదు యింక నీయయ్యవారిపొం

డుజాలు నీయయ్యవారిని మీరేమటసేయుండ మిమ్మునీయ య్యవారేమటచెయ్యని నాకక్కఱలేదని పఱుగులిడుచు పాదభగ్నంబైనట్లు కుంటికుంటి పడుచు పిట్టబెదరినట్లు మిట్టి పడుచు, కంటకశాఖిశిఖదగిలిన విడువువిడువుండని చెలుల బతిమాలుచు కక్షపాలభుజంబున మాటిమాటికిందాకిన పొడ వకుండని చెలుల బతిమాలుచు, వికారంబులుసలుపు భ్రాంగిం గని, వానివదలి యాబ్రహ్మచారివేషధారియగు పురారిం గదిసి.

సీ. కటిసూత్రమే పాటి గట్టి బాపడ యని
దెబ్బున మొలత్రాడు దెంచెనొకతె
యంటిమా చెలి తానమాడు మంచుఘటంబు
వంచి నీర్తలద్రిమ్మరించె నొకతె
యెవగావుపెండ్లికి యెదిగింతుసని పిల్ల
శిఖలాగి మిన్నందజేసెనొకతె
పులిభయంబిచట పోపొమ్మని హుమ్మని
పులితోలు పైవైచి బొదవెనొకతె
యట్టి యవమానవృత్తి, సత్యప్రసిద్ధి
గనగగనాంబరుండు గంగాధరుండు
వ్యోమకేశుండు వ్యాఘ్రచర్మోజ్వలుండు
నగుచు నగుచు హరుండు ప్రత్యక్షమయ్యె.

ద్విపద.

ఆరీతిగజదాన వారాతినిల్వ
నారీమణులును నానారీతిఁ బఱచి
భయసంభ్రమంబులు భయము రెట్టింప
రయమునఁ జని శంకరయబీలతెల్ల
నగజకుఁదెల్ప నెన్నగరానిభీతి
యగణిత వ్రీడబాయఁగరానివేడ్కఁ
గొనలుగా ముప్పిరిగొనం బుప్పబోఁడి
తనులతవడకఁ జెంతను లొంగియున్న
కలవాణిపతిఁజూచి కలకలనవ్వి
యలరులబోఁడి మాయలబోకయుండఁ
దగబుద్ధిజెప్పితి ధవునికీవనిన
మగువ నవ్వుచు నవమాలికయనియె
అకటనాథుని నేఁడియాపదఁబెట్టె
సకియ ! యాతని బ్రహ్మచర్యంబెమాన్పె
నన గౌరి మీపుణ్యమయ్యెనిగాని
నను మీర లిప్పుడే నవ్వగావలెనె
యనిదండములుబెట్టు నవసరమ్మనను
తనవృషతురగంబు దాటించుకొనుచు

ప్రమథగణంబుల బయలనేయునిచి
రమణీయరమణీ వరమణిగృహంబు
దరియంగజని మహాదరణంబుతోడ
తరుణేందుమౌళి యత్తరుణికిట్లనియె.

హుసేనిరాగం—ఆటతాళము.

రావె ముద్దులగుమ్మా సిగ్గేలనన్నెలె॥ రావె॥ అను॥
రావెనావెతదీర్చ నీవెకౌగిలీవె చేకోవే॥ రావె॥
నేనే నీమరులుగొన్నానె తాళలేనె మ్రొక్కేనె॥ రా॥
ఇందువదన నీ పొందుగోరుకొందు
నేమందు రావె ముద్దులగుమ్మ.

మ. చలమేలే చెలిమేలె చెంగలువసేజాబాదుపాతమ్మి మొ
ల్కలదూలించెడుఁ జూపువెన్నెలలతల్కుల్నాపయింజల్లవే
కులుకుంగుబ్బల గౌఁగిలించుకొనవే కోర్కెల్ తగందీర్చవే
యలివేణీ! జలజాతపాణి రమణీహాకీరవాణీమణీ !.

క. అనిమఱియుఁ బెక్కుభంగుల
వనితామణిదూరి దీనవచనరచనలన్
మినుసికదేవర వేడిన
ఘనలజ్జావశతఁజెలియఁ గని యిట్లనియెన్.

పున్నాగరాగం—ఆటతాళము.

చెలియనీవు దెల్పరాదె
తల్లిదండ్రులచాటుదాననని॥ చెలి॥
రమణిరో సర్వజ్ఞులయినవారు
తమరెరుంగనిదేమి ధరణికులకాంతల
క్రమమిటుగాదు నేరనిదాన
తప్పుక్షమసేయవలెనిది సమయముగాద॥ చె॥
ముదితతమరుమిన్నుముట్టినవారలు
కొదువగాక యొనఁగూర్చఁదగు
కార్యమిదియేమివేగిననీపాటి మాత్రము
మదిఁజిత్తగించి నామనవి చేకొనుమని॥ చె॥
మగువరో ! యింతసామాన్యము తమకేల ?
జగమెఱుంగఁగఁ బెండ్లిసలుపగ వల్లగాక
నగుబాటుగాకుండ నగరాజుచెంతకుఁ
దగువారిబంపుట ధర్మపద్ధతియని॥ చెలియ॥

ద్విపద.

అనికొమ్మపలికిన నగుగా కటంచు
తనమదివిరహవేదన నిండుకొనఁగ
నంతర్హితుండయి యంతకాంతకుఁడు

చింతచేఁ గైలాసశిఖరికిఁ జేరె
నిక్కడఁ బార్వతి యెన్నఁగావాని
చక్కెరవిలుకాని చటులబాణములు
పదులునూరులు వేలు బహులక్షకోట్లు
లుదుటుగా నెమ్మదినొక్కటనాట
తాళఁజాలగఁ లేక దరిలేనియార్తి
సోలుచుఁదూలుచు సుదతులమీఁద
వ్రాలుచుమిన్నుపై వ్రాలినయట్లు
బాలిక బెగ్గిలిప్రాణేశుఁడిప్పు
డెందుబోయెనటంచు నేమియుఁదోఁచ
కందంపువెనుకుచు నలరుపూఁబోదల
సందుల గొందుల సరసవీక్షించి
నందన చందన నగవాటియరసి
యిందుపూఁళినిఁగాన కింతిలతాంగ
బృందంబులన్నిటిఁ బిలిచి యిట్లనియె.

సీ. కనకభూధరధన్విగనరె తేజఃకన
కంబులారా కనకంబులార
తిలకించరే చారుతిలవాసుగుజ తిల
కంబులారా తిలకంబులార

కరగతకమలుఁ జూడరె సంశ్రయత్కామ
లంబులారా కమలంబులార
నవరసాలయునిఁ గానరె శుకాద్య మదసా
లంబులారా రసాలంబులార
మల్లికార్జునీశు మతికనుఁగొనరె యా
మోదమెల్లఁగూర్చి మొల్లముగను
మజ్జనకునిగవయు మల్లికావల్లిమ
తల్లులార నాదుతల్లులార.

వ. అనియిట్లు వెదకివెదకి మదగజగమనమదనదమనుంగానక
దీనకళనున్న పచ్చవిలుకాఁడు మునుపటి పచ్చిగాయంబులపై
విచ్చలవిడిహెచ్చు పెరిగ్రొత్తవిలిముల్కి మొత్తమ్ములు
హత్తించి నబిత్తరి తత్తరిల్లి యాతపోద్వేల్లి యగు నుత్పలవల్లి
పగిది మూర్ఛిల్లి పల్లవపాణు లొనరించు శైత్యోపచారంబు
లవలన నెట్టకేలకుఁదెప్పిఱిలి యుస్సునుస్సురని యిట్లనియె.

సురటరాగము—ఆదితాళము.

ఏమిసేతుచెలులార పతిగననేరనయితి నేనే॥ అను॥
ఏమిసేతు నా సామి కామ దమను
నామకొనిచనుగవను నలమక
యామరునిగరువంబుదీరదు॥ ఏమి॥
సుదతిరో యెంతచోద్యముకాని నా
యెదుటికితానైవచ్చెనె

నెమ్మదినాసోయగమెంతో మెచ్చెనె
కోర్కెలాదవించు మనసిచ్చెనె
కూడ దిప్పు డిది కాదంటివే
కటకటా వానిగదియాక
నూరకుంటివాలుగంటి
మదముగదురగ గొదమతుమ్మెద
కదుపులదె యిదెరొదలుజేసెను
మదనవిహారణసదనములగతి
బొదలుక్రొవ్విరి పొదలచెదరుచు
అదరక బెదరకశుకములు
వరదజొచ్చెను కోకిలంబులు
కదలకామెదలకా దగ్గరివదలక
దయతగూసెనయయో॥

ఉ. తనపతివచ్చునంచు నిశి, తానమొనర్పు సువర్ణకుంభమున్
బునిలయమందుముంచెనన ముగ్గె నినుం డపరాబ్ధిఁ దద్గళ
స్తనయుగకుంకుమద్రవ విధంబున సంజ యటన్నెఱుల్ విద
ల్చెనన నిరుల్ తదంబుతతి జిందెను నానుడురాజరాజిలెన్.

సీ. ఉదయాద్రికరిమీద హురుమంజిచౌడోలు
వెడవింటిపాదుశా వెల్లగొడుగు
తమిచకోరములు పాల్ద్రావువజ్రపుగిన్నె
నిశిమీదజల్లు పన్నీటికుప్పె

గగనమన్పందిరిగట్టు మల్లెలగుత్తి
విష్ణుపదంబుపె న్నొలినఖము
తెఱగంటిగమిబువ్వొదిను వెండిపళ్ళెంబు
గగనసౌధాగ్రాబ్జకాంతకలశి
కాలసురభూరుహాముపండు గగనలక్ష్మి
చేతిపూచెండు, పాంథగర్వాతిశయము
గృంగకంతుండువేయు పిరంగిగుండు
సుందరాకృతిదగె నిండుచందురుండు.

వ. అప్పుడవ్వడవింటి దిట్ట బెట్టిదంపువెండిచుట్టీటె కట్టెలంబట్టి గ్రుచ్చెత్తినట్లుధవళకిరణుకిరణంబులు చుఱుకుచుఱుకుననర్మంబులంటిన గజగమనగిజగిజలాడి, తాళజాలక మూర్ఛగ్రమ్మి సొమ్మసిలిన నలినవదనలు బెదరిపడి యపారంబులగు శైత్యోపచారంబులుగావించినఁదాపంబుదీరమి జన్నిటి నీటముంచిన నాహిమవారికళపెళనుడికె నంతఁ గొంతదడవునకు నీశ్వరానుగ్రహంబునం దెప్పిరిలి ముప్పిరిగొన్న మోహంబున నదె మదనమథనుండని కలువరించి భ్రమసిచూచి కానక లేచి యడుగులుదడబడ నొడలి సొమ్ములుసడలిపడ నేమియుఁదోఁచక తోఁడవెంబడింబడి దిరుగు వెన్నెలచిచ్చునకుందోడు తమ్మికొలంకులగ్రుమ్మరు కమ్మగాలివచ్చిన మిగులనొగిలి తెగువసేయుతలంపున నరవిరిసిన చెంగల్వపూబంగారుగిన్నెలోఁదేనెవిషంబుద్రావఁ గమకించ దిట్టచెలు లచ్చెలినిఁ దొలఁ

గించినఁ బెనంగి నన్నేల? యాపద బెట్టెదరే! యని యయ్యుప్పలకుప్పలకుప్ప నిగురుగప్పినచిప్పకుప్పయొప్పు నెరపువిరివ రవున్నంబడి, మదనాంధకారంబు ముంచుకొన్న చొప్పునవిడి యొడలెల్లఁ గప్పుకొన్న గొప్ప కప్పుకొప్పుగ వాఁడెకిఁబగవారు బంధువులని చంద్రద్వేషిణియగు నప్పడఁతుక గౌఁగిలించుకొన్నకటికిచీకటియో? యనఁ జెన్నెసఁగ నుసురుసురని పొరలు పొరలి దరిలేనిబెడిదంపుచెత గడగడవడంకి వెన్నెల వేఁడిమికి సొమ్మసిలు. సొమ్మసిలి ఏఁడెవాఁడు వాఁడు కాఁడు కాఁడని పలువరించి యులికి దిగ్గునలేచి నల్దెశలు సూచుకారణంబులేక యూరకపకపకనవ్వుచు పిలిచినం బలుక కుండుఁ బిలువకున్నం బలుకు నిట్టూర్పుమ్మయావస్థఁ జిక్కఁ జక్కెరబొమ్మ వెక్కివెక్కి యుక్కంటిపై మన్కువఁ గన్నీరుమున్నీరుగా వగవ నూడిగంపుచేడియలు బలువగపులఁ దన్నూరడించుచు మరందంబులా సుమిళింద బృందంబుల యందంబున విరిపరుపురంబొరలు పెన్నెరులు నుదెశ్శంగట్టిగా ముడిగొల్పి కన్నీరుదుడుచువారిం జూచి యీయాయాసమేల? నాయూసవదలుండు ఋణానుబంధం బిట్టుండె నాగతిజూచి నీచిరుతఅతకూనలకు నీచిన్నికన్నెపొన్నగున్నలకు నాదరణంబునఁ బరిణయోత్సవంబు సేయుండని యొప్పగించి, బెట్టిదంబగు యంతర్గతదుఃఖంబు పట్టజాలక యామధురవాణి నీలవేణి పాణిక్వణితమాణిక్యవీణాగుణనిక్వాణమానుకీర్తిధురీణాం

బగునెలుంగెత్తి ఘోరుననేడ్చిన సాజాత్యదా రవశంకంబెదరి కిలకిలమనుచుఁ గోకిలలుం జిలుకలుం గదసి పలుదెరంగులఁ గూయందొడంగినఁ జెలిమికత్తెలు తత్తరిలి; బిత్తరి నిత్తోట నుంచుట మంచిదికాదని చంద్రిక సోకునకుఁ దలఁగి జిలుఁగు వలువముసుంగిడిన వడపోసినట్టున్న వెన్నెలనిగ్గు నాటుకొన్నట్లు విరహపాండురంబగుతనువు తమపయింజేర్చుకొని సఖీయూథంబు తదవరోధంబులగు నిజకేళీమణిసౌధంబుదరికిదెచ్చినఁ దచ్ఛిఖరంబునంటి నట్లుల్లసిల్లుజాబిల్లింగని వీఁడె మనమేడమీఁద రేఱేఁడున్నాఁడు వీనిఁబట్టుకొందమని సోపానవితానమార్గణంబున జనఁదివురు చివుఁరుబోఁడిమౌగ్ధ్య సాహసంబున కరుదంది చెలియ లమ్మా! వీఁడు రేఱేఁడుగాఁడు మండలీకృతకుసుమకోదండం బదే కలంకంబుగాదు మధుప శింజినియవి ధవళకిరణంబులుగావు పుంఖానుపుంఖసమాగత మదనమల్లికాముకుళితమార్గణంబులనిబోధించి హర్మ్యాంతరశయ్యాంతరంబున నునిచిన నబ్బోటి జాబిల్లిరా గోడలం బ్రతిఫలించునిజవదనబింబంబులనేకశశిబింబంబులుగాఁదలంచి బెగ్గలి సౌధంబు వెడలివచ్చి కురంగట హారంగైనబంగరు టఱుంగునంగూర్చుండి చంద్రునుపలక్షించి యిట్లనియె.

చ. మతిచెడిరాత్రిఁ గుమ్మరి హిమంబు మియంగసనాథలైనద
త్సుతులను సాధుచక్రములఁ దమ్ములనేచఁగ నెట్టిరాక

యమృతపరిపూర్ణవై కృతినిఁ బొందఁగఁజూచి విరించినిన్గళా
గతి శశపాళిశృంఖలలఁ గట్టి పయోనిధిముంచు నిత్యమున్.

గీ. ఉదయమైనది మొదలుగా నొక్కపెద్ద
చెవుఁబిల్లిని నడ్డంబుచేసిపట్టి
యోద్విజరాజ! నీవును నోటఁదిరిగి
కొనుటపాంథుల యశుభంబు కొఱకుఁగాదె.

సీ. మొగముజూడకయింత వెగటుగాఁపించుట
యందమా యుడిసెను చందమామ
మనసులోమెలఁగుచు మర్యాదదొలఁగించి
మనసునొప్పింతురా మనసిజాశ
ప్రాణబంధుత్వంబుఁబాపి గాలిపిశాచ
మన సోకియేతురా యలసపవన
మాటమంచితనంబుమాని యింతయెఱింగి
పడుదుర శుకపికపాళులార
తుమ్మెదనటంచు నేపనితోఁచకుండఁ
దరిమిఝుంకారములు సేయఁదగునెఁభృంగి
నీలకంఠాఖ్యఁ బురివిచ్చి యేలకేక
లొనరవేసెద సిగ్గుమాలినశిఖండి.

వ. అని యిట్లనేకవిధంబులఁ జంద్రాదులు నిందించి యంతకంత
కగ్గలంబగు విరహవేదనంబుండి నానావస్థలంబొందిన చెలిమి
కత్తియలు చిత్తరికి శిశిరోపచారంబుల సేనదేర్చి యవ్వాతి

వృత్తాంతంబంతయు, మేనకాహిమవంతుల కెఱింగించిన వా రును భయచింతాసంతోషంబులు ముప్పిరిగొన సర్వమంగళా వివాహమంగళకార్యంబు శ్రీమన్నారాయణానుగ్రహంబు నంగాని సంఘటింపదని గోవిందపాదారవిందధ్యానాధీన మానసులై యుండిరంత.

ఉత్సాహావృత్తము.

ఘనవినీలరుచివిశాల కనకచేలవిద్విష
జ్జనవిఫాల దనుజకాలసత్వలీల యిందిరా
మనమూల మహితఖేలమాస్యధీ లసద్గుణా
వినుతశీల వేదలోల విబుధజాల పాలనా.

గద్య. ఇది శ్రీమన్నారాయణ చరణ దాస్యపవిత్ర, గోకులపాటి బుచ్చనామాత్యపుత్ర, శ్రీ తిరుమలపెద్దింటి సంపత్కుమార వేంకటాచార్యదేశికానుగ్రహసనాథ, శ్రీకూర్మనాథప్రణీతం బైన మృత్యుంజయ విలాసంబను శృంగార నాటకగేయ ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీరస్తు.

# మృత్యుంజయవిలాసము.



## తృతీయాశ్వాసము.



శ్రీమత్త్రయీవతంసిత
తామరసచ్చరణపత్త్రిధ్వజహరివార్ము
క్కోమలశ్యామల తనుయుత
చామీకరవాస సర్వజగదావాసా.

వ. అవధరింపుము.

గీ. అంత ప్రొద్దువొడిచె నగజకేశుఁడు గట్టఁ
గాలమనెడుస్వర్ణకారకుండు
దనర పొడుపుకొండ దాగటిపై నేర్పు
పొదలజేయుతాళి బొట్టనంగ.

వ. అప్పుడు శ్రీమన్నారాయణప్రేరితులై సమస్తమంత్రరహస్యవిదుఁడగుకశ్యపుఁడును, తపఃపూతగాత్రియగునత్రియును, దివ్యతేజస్సమాజుండగు భరద్వాజుండునునిరస్తాంతరామిత్రుండగు విశ్వామిత్రుండును నుత్తమోత్తముండగు గౌతముండును నరుంధతీసహాయ గరిష్ఠుండగు వసిష్ఠుండును శాంతమునియగు జమదగ్నిమునియును నేతెంచునెడ దివ్యమణిభాను

మంతంబగు కైలాససానుమంతంబున పార్వతీ విరహాదురవగా
హకాయజ శరనికాయదోధూయమాన మానసుండగు నస
మలోచనుండు సత్యకలంకితతత్పర్వతాధిత్యక యందిందు
కాంతశిలాతలంబునంగూర్చున్న భృంగివారలంగనియిట్లనియె.

శంకరాభరణరాగం—ఆటతాళము.

కడుదూరమున పెద్ద బడుగులలాగువచ్చెడువారెవ్వరుసామి
యో-పడుచుతనము మాను పరమఋషులవారి
క్కడికివత్తురుభృంగీ॥ కడు॥
బలుచీకునారకట్టలు వెచ్చిరిగిజ్బ
పలుపులకోసామి యోఃపలుకాకి నీవిట్టు
బలుకకు మహర్మరులగడ్డములుభృంగీ॥ కడు॥
శిరమున చుట్ట కుదురులు బెట్టిరియేమిబరువుమోయ నుసామి
యోరి సరసుడౌరవారి జడలెల్లయీలాగు
తరుచుజుట్టుదురు భృంగీ॥ కడు॥
మెండుగ చేతుల కుండకోలలుబట్టి యుండిరేమిసామి
యోరీ దుండగీడ వారి కుండు కమండల
దండములుభృంగీ॥ కడు॥

వ. అంత నమ్మహర్షులు యథావిధి శివదర్శనంబొనర్చి యుచిత
రత్న పీఠంబులం గూర్చున్న నభవుండు బహుమానంబుగాఁ
గుశల ప్రశ్నంబు జేసి ప్రసంగవశంబున సర్వమంగళావివాహ
మంగళకార్యసంగతిదెచ్చి యిక్కార్యంబునకు మీరుఘటకు

లై నిర్వహింపవలయునని వివిధవచన రచనల చతురిమ
నెఱపి మఱియు నిట్లనియె.

ద్విపద.

ఘనులార మునులార కరుణాత్ములార
వినరయ్య యానిత్యవిధులు చాలించి
యగనేతసన్నిధి కరుగంగవలయు
తగుఫలాదుల తోడ దర్శింపవలయు
మఱియు పెద్దలగూర్చి మాట్లాడవలయు
పారలౌకిక కార్యంబు పొసగించవలయు
కార్యార్థి నఃకృతో గర్వమున్నట్లు
నార్యకై యందఱ ననుసరణంబు
సేయగవలయును స్త్రీలను గూర్చి
నీయరుంధతితోడ నేనేగవలయు
వెండిబంగారముల్ వెలితిగావనుడు
కొండలకొలదిగా గూర్చెద మనుడు
యిల్లు చేపట్టిన యింతి కేనిత్తు
కల్లగా దికార్య ఘటన మైనంత
వలనొప్పుటకు మీవంటివారేగి
మెలఁతగూర్పకయున్న మీకె లాఘవము
తల్లిదండ్రులను నన్నదమ్ముల నెఱుఁగ
నెల్లచుట్టములు మీరే కారె మాకు

కంమవత్తోడ జక్కఁగ బ్రధానంపు
చందంబులగ్ననిశ్చయముగావించి,
పాలకూళ్ళుడిచి నాపాలికేతెంచి
జాలిదీర్పఁడటన్న సందియంబలరి
దేవ తథైవాస్తు తేచిత్తవృత్తి
రేవంవిధాచే త్వ దీప్సిత మాసు
భగవత్సహాయేన ఫలితంహిభవతి
నిగమాశ్వనిగఁర్వనిర్వికారేశ
సర్వజ్ఞ నస్త్వమచుఙ్ఞాం దేహిగంతు
ముర్వీధరంప్రత్యహాశర్వ యనిన
హరుఁడు మనోవ్యథహరుఁడయి నెనరు
దొరల నబ్బాసవాల్దొరల వీడ్కొలిపె॥

వ. అంతనాసప్తర్షిఁవర్యులు హిమగిరికరిగిన హిమవంతుఁడు బ్రత్యుద్గానాభివందనంబులుగావించి నవరత్నఖచితసింహాసనాసీనులం గావించి యిట్లనియె.

సారంగరాగం. ఆటతాళము.

ఎంతోభాగ్యము మాకుమీరు
మాయింటికి వేంచేశినారు॥ అనుపల్లవి॥
కంతుజనకపదకమల భక్తులుమీపా
దాంతరజముమాయందుసోకినజాలు॥ నెంతోభాగ్యము॥

వారిజగర్భాదులైన
మిమ్ముఁగోరినరారటుగాన
కూరిమితోఁ బిచ్చుగుంటమీాటభా
గీరదివచ్చినక్రియతోఁచె నిప్పుడు॥ యెంతో భాగ్యము॥
ఘనమైనమేలు చేకూరు మాకు
గాకున్న పెద్దలురారు
మునుపటి మాపుణ్యములు నేఁడు ఫలియించె
మునిముఖ్యులారమిమ్మునుబూఁడగంటిని॥ యెంతో భాగ్యము॥
కన్నులకరువ్వుదీరంగమిమ్ముఁ
గనుగొంటిప్రేమమీారంగ
యన్నలారమీార లరు దెంచుకార్యము
విన్నదాక చెవులు వెతబడుచున్నవి॥ యెంతో॥

ద్విపద.

అనినసంయములుబ్రహ్మానందమంది
దనరినప్రేమ భూధరనేతకనిరి
మూరాకశుభమని మన్ననతోడ
మీారుబల్కినపల్కు మిథ్యయేలగును
ఘనతరశుభ కార్యఘటనకై వచ్చి
నినుగనుగొంటిమి నిత్యకల్యాణ
ధర్మసంగ్రహుఁడౌ సదాశివునకును
కూర్మిబిడ్డనొసంగు కులశైలరాజ

చక్కదనం బెన్న శక్యమేమరుని
ప్రుక్క చేసెను దనుస్తోమమ హ్వారి
యననేమిఁటికిసమస్తైశ్వర్యయుతుఁడు
ఘనవిద్యయతనికిఁగలదననేల
సర్వజ్ఞమూర్తిఁవంశస్థితి లోక
గుర్వియకారాజతగోత్రాఢ్యుఁడౌట
నచలధర్ముఁడు సమస్తాంశములందు
ప్రచురభాగ్యముఁగల్గు పరికించిచూడ
మీచిన్నిబోటిచెల్మికి ! దగునాతఁ
డాచిన్ని నెల దాల్పునధిపుని జెంద
యోగ్యరా లిక్కన్యయూహించనింక
భాగ్యభోగ్యములచే ప్రబలుచునుండు
నేవిచారము మానియిమ్మనీపుత్రి
నావుడు నగరా జనంతసంతోష
మంది యిట్లను భవదాజ్ఞ మీరుమనె
కందర్పహరునకు గన్నియనిత్తు
నగణితగుణశాలియగు కుమారికను
దగినట్టిచోటికి దగిలీయవలయు
నింతకన్నను శుభమేమున్నదయ్యా
వింతలేదని బహు విధములబల్కె.

వ. అంతకమున్నయరుంధతి శుద్ధాంతంబునకరిగి మేనకచేత సంభావితురాలై యిట్లనియె.

శంకరాభరణరాగం—ఆటతాళము.

హారుడు నీయల్లుడయ్యె దనని యున్నాడరిదినీభాగ్యము మేమన కా. పరమపాతివ్రత్య పావనిమీచిత్త సరణిచొప్పగునెయరుంధతీ॥ హారు॥ ౧॥

తరుణేందుమహాళికి తరుణేందునిటలకు దగునెసాంగత్యము మేనకా వరపుణ్యపతులు మీవంటివారిదయ వచ్చినజాలునరుంధతి॥ హారు॥ ౨॥

అరుదుగ నీదంపతులపెండ్లిజగదానందమానె యోమేనకా సిరులిచ్చి తావకాశీర్వాదమే శుభకరమైయలరునరుంధతి॥ హారుడు॥ ౩॥

వ. అప్పుడప్పుడమిదాల్పుదొరబొట్టె యిట్టట్టనరాని సొగసులుట్టిపడ దండంబుబెట్టిన నరుంధతిబిట్టు తెగనూళ్ళగొట్టినదిట్ట చెట్టబట్టుమవవ దీవించి ముద్దులుమూటగట్టుగట్టుపట్టిం గౌఁగిటంబట్టి తొడలపై గూర్చుండబెట్టుకొని చెక్కిలి ముద్దుబెట్టుకొని మొట్టకేల కిట్టులనియె నాచిట్టితల్లీ! నిన్నిప్పుడెగట్టి చేసుకోవలె నీవమ్మహాదేవు పట్టంపుదేవివై కైలాసపట్టణంబుననున్నట్టి వేళ మే మప్పట్టునకువచ్చిన సమ్మధికప్రమథకర వేత్రంబులంబట్టి గొట్టింతువో లేక నాటిపేరముత్త యిదువరారా నిమ్మనికటాక్షించుతువో తెల్పుమనిన మానవిత

లజ్జావనతాననతామరసయై శుకపోతంబులకు మేతయిడ లేదనిలేచి సాచీకృతంబగు తెఱమఱుంగున కరుగునక్కరి గమనంగని మాయమ్మ రమ్మరమ్మ నాదినేరముసీవేల కటాక్షింపకుందువుఅక్షీణజగద్రక్షాదీక్షాసాక్షాల్లోకమాతవుకరుణోపేతవు మరలనింకొకసారివచ్చి యుపగూహనంబిచ్చి పొమ్మనివేడ,రాక పరాకై యుండ,మేనక చిఱునగవుచేత కూతుబొమలనదలించి జగత్పావనియామె బిలిచిన రాకుందురే యనునెడ హిమవంతుండువచ్చి నిజకాంతతో మంతనంబునకు శుభవృత్తాంతంబంతయుఁ దెల్పిన సంతోషించి యప్పరమేశుతోఁదులదూఁగి కల్యాణం బెట్టుగావించెదనో యని విచారించి మంచిది మనపాలి భక్తవత్సలుఁడగు పుండరీకాక్షునకు దయగలిగిన వారే వేంచేసి మహోన్నతంబుగా మహోత్సవంబు నడిపింతు నాకేమని నిశ్చయించి పెండ్లికొడుకుం దరలించుకొని రమ్మనుమని యుచితసత్కారమ్ముల నమ్మునుల వీడ్కొల్పిన.

ద్విపద.

ఋషులేగి తచ్ఛుభవృత్తాంతమంత
వృషతురంగునితోడ విన్నవించగనె
కడలేనిముదమంది కైలాసనగరి
కెడనలంకరణంబు గావించినించి
బ్రహ్మాదులనుబిల్వ బంచిశంభుండు

బ్రహ్మాండపతియైన పద్మాక్షుబిల్వ
సనకాదులకుగాని శక్యమేయనిన
సనకసనందన సంయములపుడే
చనుదెంచినిలిచిన సత్క్రతిజేసి
వినయంబుతో జగ ద్విభుఁ బిల్వనంపె
నప్పుడు మునివర్యు లత్యాదరమున
నుప్పరంబున స్వస్వయోగబలంబు
చెయ్యూతగా మరుత్సిద్ధసాధ్యాదు
లొయ్యనజోహారు లొనరింపగొనుచు
ఘనమండలముజూచి కంజాక్షుదివ్య
తనుతుల్యమిదియనితద్దయునలరి
నాకమ్ముగడచిమహాతపోముఖ్య
లోకమ్ములును సత్యలోకమ్ముదాటి
కమలాక్షునగరమ్ముగనుగొనలేక
శ్రమపడియద్దేవు చరణాంబుజములు
మానసంబుననిల్పి మాధవువేడి
మానీంద్రులప్పుడు మఱియునిట్లనిరి.

దండకము.

శ్రీమజ్జగద్రక్షణాక్షీణదాక్షిణ్య కందర్పకోట్యంచితాగణ్య తారుణ్య లావణ్య ! భోభో రమాభూముఖాంభోజగంధీ విభోనమః ప్రభోకృష్ణనారాయణా నంతకాగోవిందవిష్ణోహ శే

శ్రీధ రేత్వయ్యనఘూత్మ మంజీరకానంతరత్నాంశుసాంగత్య నిత్యోల్లసత్పాదకంజాత సంజాతమారందబిందూభవద్గాంగ నీరే చిదానంద సారే స్వకీయోపరి భ్రాజమానూరుకా తాని కా ధశ్చరన్నక్రనిర్వక్రిజంఘాశరధ్యుజ్జ్వలే దైత్యజద్దోర్బలే సన్మనోం చోరుకాండచ్ఛలోద్దండవేదండ, శుండాద్భుతోద్యత్కటిప్రాంతటీ సంవలద్ధీరకాంచీకళిన్సాగరోత్పన్ననాభీ శుభావర్త భాగోత్పదద్బిందు బృందాయమానాననాఖ్యారవిందాది సేవా సమాయాతనక్షత్రజాలోజ్వలత్తారహారే, సమస్తాగమాంతాద్రిఖేలన్మయూరే, రమాకోమలాంగీ దృఢాలింగన ప్రక్రియాముద్రితోరోజకాశ్మీరపంకాంక శంకాంకురేణస్ఫురన్నాభికాకోటరోగ్య చ్చతుర్బాహుశాఖాంకుళీ పల్లవాళీనఖానూన సూనోల్లసత్కాయకల్పద్రుమాం చత్ఫలాకార్యధుర్యేణ చిత్తాంబుజాతాత్ గాగణ్య కారుణ్య కాంతి ప్రకాశేన,వక్షస్థలీ బింబితాత్మాధరోష్ఠభ్రమాపాదినా కౌస్తుభాఖ్యైకమాణిక్యరాజేన దేదీప్యమానే, కనన్నాభికాజాంగభారూపసౌవర్ణవాసోపమానే,పయోజాలయాబాలికాకేళి కాడోలికా ప్రోల్లసద్వైజయంతీలతామాలికే బాలచంద్రాలికే నిత్యమూర్తీభవన్నైజకీర్తిప్రతాపస్ఫురచ్ఛంఖచక్రాపదేశాతతానేకలోకావళీరాత్యహః కార్యవిజ్ఞాపనాయాత చంద్రార్కచారోన్నమత్పద్మమాలాల్యాంచితే, శాంబరీముంచితే దంతివిద్వేషకృద్దాహసాత్రమాట్చిరః ఖండ నా న ంత రా

త్యంత సంపోషితేక్షామృతౌఘార్ద్రితన్న క్రపోతాకృతోపే తలీలాహారిద్రత్నవత్కుండలాఖండలావణ్య భాగండభాగే సదా పూర్ణభోగే; ముఖోద్భూతసుశ్వేతమృత్స్నాత కృచ్ఛిద్ర భద్రోర్ధ్వపుండ్రప్రభాపుష్ప శయ్యాంతరోదీర్ణ కాశ్మీరచూర్ణాతి బాలత్వసూక్ష్మాగ్ని రేఖా, విరాజల్ల లాటే పతన్నేత్ర ఘోటే నితాంతా బమిత్రాకృతి ప్రోల్ల సల్లోచనే పాపనిర్మోచనే మానిచిత్తోత్పలానంద కృద్దీనపాళీ చకోరప్రియపార్ద్ర మందస్మితోదార దృక్చంద్రికాసాంద్ర వక్త్రేందుబింబే మనోజ్ఞోష్ఠబింబే మహాకోటిసూర్యోజ్వల త్కోటి మాణిక్యకోటీరరారాజ మానోత్తమాంగే పయో భృన్నిభాంగే మనోనో వినోదేపఖేలత్వ హాసత్వమూ తేశ శరశ్చంద్రకీర్తే, భవన్నామసంసారదుర్వారవారాన్నిధే ర్నౌఘుసాదార్యగాంభీర్య ధైర్యావధేసత్యసంకల్ప యుష్మ ద్గుణానాంస్తుతేరాః కియంతోవయం తోయజాతాక్షమాన మాదతు తేజాప్యదక్షోవిధిర్నావధీశక్తిహీనోప్యహీనోభవా కారణంకారణానాక్షరంమంగళం మంగళానాం పరస్మాన్న రోస్మాక మద్యత్వదుద్యత్పదద్వంద్వసేవాం, ముదాదేహినః పాహితుభ్యన్నమస్తే నమస్తే నమస్తేనమః.

వ. అని యనేక గతులొనరించు నమ్మునిపతులకృపావిలాసుం డగు శ్రీనివాసుండు ముముక్షుజనాపేక్షితంబగు నిజపురాధ్య క్షుంబుతో నక్షణంబునసాక్షాత్కరించిన వారిని వారితాశ్చర్య

చర్యాతరంగితానంద పారావారంబునందేలి తన్మహాపురి సరణినరుగు నవసరంబున నుపనిషన్మయంబులును దివ్యతేజః పుంజంబులునగు నమ్మేడల వాడలవాయించక నే తమకుదామే దామోదరనామధ్వనులు తాళాలుగుణంబుగా మ్రోయు శంఖభేరీమృదంగ పటహఢక్కావేణు వీణాదులంజూచి యరు దందుచు నంతవేదాంత వాక్సంతానంబుల నయ్యనంత మూర్తి యనంతకళ్యాణగుణంబులుపన్యసించు శుకపికశారి కాపారావతనీలకంఠ జాలకంఠనాదంబులకు వినోదంబునొం దుచు,మఱియు నెందుజూచిన నందఱునతిసుందరులును చిదా నందభరితులును శంఖచక్రాదిలక్షణలక్షితులును పీతాంబర కలితులును, నమ్మహాపురుషుల సందర్శించి ముకుందతుల్యు లని వందనంబులొనరించుచు చనిచని యవలనవాఙ్మానసగోచ రంబగుతదీయమాహాత్మ్యంబునకు చిత్రవిచిత్రంబునొందుచు నిజమణికాంతి సంతానాధః కృతజగద్ద్వారంబగు రమాకాం తాంతఃపురద్వారంబు చేరంజని తత్ప్రాంతంబుల వెన్నుని సన్నిధి తమతమమనవులు విన్నపంబుసేయుకొఱకు స్వామి భృత్యులంబతిమాలు బ్రహ్మాదులంజూచుచు ననిరుద్ధానుగ్ర హంబునంజేసి ద్వారికులవలన ననిరుద్ధులై సమిద్ధసహస్ర కోటి మణిస్తంభ బద్ధశుద్ధాంత భవనంబులుగడచి యుద్దామ తేజోవేశంబువలన చంద్రసూర్యాగ్ని నక్షత్రాదికంబులు తేజోయుక్తంబులై వెలుంగునట్టి దివ్యసౌధంబు పొడగని

యందునందంద నందసునందగరుడ విష్వక్సేనాది ముకుంద భక్తుల సందర్శింపుచు తన్నిర్దిష్ట నూతనరత్నసోపాన వితానమార్గంబున నత్యున్నతవిశాలోపరితలంబున కెక్కి నచ్చట ననర్ఘ్యమణి సింహాసనంబున విస్తీర్ణబహుమృదుతరాస్తీర్ణంబున సహస్రఫణామణిప్రభాభాసితానంత భోగి భోగంబున సజలజలద విగ్రహుండును కటాక్షలక్షితభక్తానుగ్రహుండును మహామహోన్నతమకుటమకరకుండలమౌక్తికహారమణికేయూరకంకణకాంచికాకటకకలితుండును కనకాంబరభాసితుండునై యనేక దివ్యాప్సరోజనంబు లూడిగంబులుసేయ శ్రీభూనీళాదేవులు పరివేష్టించి కొలువమరు శ్రీమన్నారాయణస్వామిని దిలకించి పులకించి యానంద బాష్పంబులుచిలికించి తదీయచరణకమలంబులకు సాష్టాంగ దండప్రణామంబు లొనరించి మొక్కుంత దడవునకు లేచి కరపుటంబు ఫాలతటంబున నిడి నిట్లనిరి.

సీ. శ్రీమనోనాథాయ జితదైత్య యూథాయ
బలసనాథాయ తుభ్యంనమోస్తు
కాంచనచేలాయ కారుణ్యశీలాయ
భక్తపాలాయ తుభ్యంనమోస్తు
జితఘనదేహాయ హతమదమోహాయ
పతగవాహాయ తుభ్యంనమోస్తు

త్రిజగద్వరేణ్యాయ దీనశరణ్యాయ
పరమపుణ్యాయ తుభ్యంనమోస్తు
పన్నగేశయాన తుభ్యంనమోస్తు
పన్నమన్నిజ జేంద్ర తుభ్యంనమోస్తు
సన్నుతావన్నవరద తుభ్యం నమోస్తు
సన్నికరసుప్రసన్న తుభ్యం నమోస్తు.

శ్లో. జయాంబుధి జయాయుక్త జయమృత్యుంజయ ప్రియ
జయ సత్యజయోపేత జయాధోక్షజయాగప
జయకృష్ణజయానంత జయాచ్యుత జయావ్యయ
జయ విష్ణో జయ శ్రీశ జయ రామజయప్రభో.

చూర్ణిక. జయజయజయవిజయకరపుటీ పటీ యోవేత్రనటీ రంగాయమాన సురపుంగవమకుట మహామహాప్రకట జయ జయాఖిల జగజ్జాలరక్షా దక్షదీక్షకటాక్షవీక్షణ నిరుపమిత శుభలక్షణ జయజయాంబోధికుమారీకుంజరీ సంభృతఘుర్జ్వలత్కుచ కుంభయుగే మృగమదపం కామ్రేడితాసిత విభావిభాసితశరీర మహామహోద్ధార జయజయాఖండ పుండరీక భవాండపరిపూర్ణోదర దీనజనఘనాదర కింకుర్వాణగీర్వాణీశ శర్వాణీ ప్రాణేశవాణీశ ! రమారమణీశ వంచితాసుర ప్రపంచసమంచిత పాంచజన్య సుదర్శన కౌమోదకీశార్ఙ్గాది పంచాయుధవహా ద్వాహోద్వయద్వంద్వ నిర్ద్వంద్వ వసిష్ఠవామదేవ వాల్మీకి వాలిఖిల్యాదివాచం

యమివారవందిత సుందరచరణారవింద-ముకుంద పరమా
నంద గోవిందదామోదర-రామమాధవవామననారాయణేతి
చపలమతీనన్యగతి సద్గుణతతీనఖిలాక్ష వ్యసనరతీసమంజసా
సమంజనకరుణారస పుంజరంజిత కటాక్షేక్షు - కమలాక్ష
జగన్నాటక వినోద నః ప్రసీద-నోంత రరివర్గా న్విదారయ-
గ్రాహగమరాగ్రహస్తసుస్తంభే రమాపాలనాతివేలరయ-
దుఃఖసాగరా ముద్ధరోద్ధర- శ్రీధర పాహిపాహి కృపాహితే
గుణస్వరూపాహితే హితరతిమన్మానమోభవంతే-ఓన్నమో
భగవతే శ్రీకృష్ణాయ హరిహ్యాశకృష్ణాయ-విష్ణవేజిష్ణవే మధు
సూదనాయ రిపుభేదనాయ-గరుడవాహనాయ జగన్మోహ
నాయ వ్యయామాచ్యుతానంత కోటి బ్రంహ్మాండనాయ
కాయ-ఫలదాయకాయజగత్సృష్టిస్థిత్యంతకారణే నిర్వికారిణే
జగత్కారణాయ-పాపహారణాయ పాలితహారణాయ అఘా
ఘమర్దనాయ-ఘనశ్యామలాయ కోమలాయ శ్రీనివాసా
య వైకుంఠవాసాయ జగత్కర్త్రే నమస్తుభ్య మభ్యంచిత
కౌస్తుభాభరణభూషితాయ-రమాతోషితాయ కనకాంబ
రాయ నుతాంబరాంబరాయ-నమస్తే నమస్తే నమస్తేనమః.

ద్విపద.

అనినుతియించిన యమహామునివరుల
ఘనకృపామృత రసకలితంబులైన
కన్నుదామరల జక్కఁగఁ జూచి మోము

పున్నమజాబిల్లిఁ బోడమిన చిన్ని
వెన్నెలవలె నవ్వువిలసిల్ల మిగుల
మన్ననతోఁడుత మాటమాటకును
తేనెఁ లుట్టిపడ నద్దేవు డిట్లనియె
మానీంద్రులార మామక సన్నిధికిని
మీరువచ్చినపని మే మెఱుంగుదుము
గౌరీరమార్యాత్మ కల్యాణములకు
మముబిల్వఁబంపె సామజదనుజారి
క్రమమట్లయైన నిక్కము గౌరియందు
నతిశయకృపగల్గి నందునశైల
పతిపక్షముగ వత్తు పరిణయమునకు
నేరీతి తమపెండ్లికే రాకకాదె
మీరుబ్రహ్మేంద్రాది మిళితులై వెండి
కొండకుజనుఁ డని గోవిందుఁ డనినఁ
బుండరీకదళాక్షు భవనైకరక్షు
జలజపాదములకు సాగిలిమ్రొక్కి
సెలవుపుచ్చుక మునిశ్రేష్ఠు లవ్వేళ
బ్రహ్మేంద్రముఖ్య దిక్పతులనుగూడి,
జిహ్వాకభూపాద్రి సీమకుఁజనిరి.

వ. అంతఁ బురాంతకుం డంతయు విని యత్యంతసంతోషిత స్వాం
తుండై బ్రహ్మేంద్రాదుల నుచితసత్కార సంతుష్టులంజేసి

తనదు నెచ్చెలియైనధనదుతో నభీష్టప్రాప్తిరూపప్రీతిసము
చ్చయంబులకు ముప్పేటలాడుచు నొక్కసుముహూర్త
దినంబునభేరికాభూరి కాహళరంగన్మృదంగవేణువీణాది నిస్వ
నంబులు జెలంగ రంభాదినటీనాట్యంబు లలరంగ వందిమా
గధవారంబుల కైవారంబులుమీఱంగ వశిష్ఠాదిమునిజ నాశీ
ర్వాదంబులువొసంగ యనేకత్రిలోకవాసులంగూడి పరిణ
యోత్సవంబునకు హిమగిరి కరుగునపుడు.

సీ. మెఱుఁగుదీగెలకన్న మేలన్న పటుజటా
పటలంబు నెఱిజరీపాగగాఁగఁ
జెలువైనగళలీన గలచిన్ని సెలకూన
పృథులవజ్రపుసరిఫేషుగాఁగ
నలరారు సికతీరుగలుగు బల్మిన్నేరు
బొండుమల్లియపువ్వుదండగాఁగ
మిసిమిచేతఁ జెలంగు భసితంపుతేఁబూత
రంగైన సన్నపుటంగిగాఁగ

తే. తెలిహొనఫణాళి తాళులుగాఁగ
మేలుపులితోలు పైవన్నెశాలుగాఁగ
సొగసునెగకన్ను కుంకుమచక్కగాఁగ
వృషహయము నెక్కి పెండ్లికి వెడలె శివుఁడు.

ఉ. హరుఁడరుదెంచువార్తవిని యాహిమవంతుఁడునంతమేరుమం
దరముఖబంధులం బిలిచి తామరసాక్షుఁడు రాకయున్న నీ

పరిణయమోదమేమనుచు భావనసేయ ముకుందుఁడీశ్వరే
శ్వరుఁడు కృపాతిరేకవిలసన్మతితోడఁ బ్రయాణ మాతఱిన్.

క. శ్రీభూనీళాదేవులు
హేలాగతితోడ వెంట నేతెంచుటకై
చాలా వేఁడిన హరిమీా
రేలా వలదనియె మర్మమీాయకయంతన్.

వ. అప్పు డప్పలుకులు విని కలిమియొప్పులకుప్ప వెతముప్పిరి
గొన్న మూర్ఛంగప్పి, సోలి తెప్పిరిలి రెప్పలెత్తిచూచి
యప్పరమ పురుషున కిట్లనియె.

కేదారగౌళరాగం — ఆదితాళము.

ననువిడనాడ న్యాయమవునా॥ అనుప॥
ఘనుఁడా నాసామీా కనికరముమాని॥ నను॥
యెన్నఁడైన నిన్నెడబాసితినా
కన్నెడసేయుటకు-కారణమేమి
వెన్నుఁడ నాసేయు విన్నపమాలించి
మన్ననతో నేలుమా నీకు మ్రొక్కెను॥ నను॥

వ. అనిన మనసుగరంగి మాధవ్రం డిట్లనియె.

సురటరాగం — త్రిపుటతాళము.

కలనైన నినుబాయ గలనా యోలలనా॥ అనుప॥
లలన రావేమది కలక మాని వేగ॥ కల॥
అలికులవేణి కలపికవాణి

జలరుహపాణీ నా తలనెవ్వరమ్మున్నది॥ కల॥
చక్కెరబొమ్మా చక్కనికొమ్మా
మక్కువరమ్మా నే మరులుగొన్నవాఁడ॥ కల॥
చిలుకలకొలికి చిత్తజుములికి
కులుకుచుఁబలికినా కోర్కెఁదీర్పుమిపుడు॥ కలనైన॥

వ. అంత ధరాకాంత, కుపితస్వాంతమై కేళికాగారతల్పంబువదలి యొక్క కాంత నిశాకాంతోపలవితర్దికాంతరంబున నుత్తరీయంబు పర్యంకంబుగాఁ బవ్వళించి వగచుచున్న వెన్నుండు వచ్చి చెంతఁ గూర్చుండి పార్శ్వభాగం బంగుళియోగంబు జేసిన నవ్వక యవ్వేలంది, చే వదలించి ముసుంగిడిన బలిమి ముసుంగు వలువదొలంగించి చుబుకంబునివురుచ నిట్లనియె.

శ్లో. వదనే దృగంత మదనేవహాస్మితం
సదనే వసాంశుమదనేకతల్పకే
రుదనేహాకుందరదనే మమప్రియం
వదనేప్రకాంతపదనేత్రపంకజే.

ఉ. నావినిపల్కెఁబంటచెలినన్నిటు లేదురిదానిఁ జేసి నీ
వీవగ లీవినోదగతు లేటికిఁ జూపెదు తేటయయ్యె నీ
భావము నీదుప్రాణసఖి పజ్జకునేగుము కోపగించు ల
క్ష్మీవరచాలుఁజాలుననుఁ జేరకు లెమ్మనినించె బాష్పముల్.

మ. అనిన న్నవ్వుచుఁ గౌఁగిలించుకొని బాలా చింత నీకేలనే
నినుబాయంగలనా యటంచు దయకన్నీరొత్తి మోమెత్తిచి

క్కనికొప్పొప్పఁగఁ దీర్చి హారములు చక్కంగఁగూర్చియూరార్చి ర
మ్మనిసమ్మోదమునందఁ జేసె నపుడయ్యాపన్నబంధుం డిలన్.

వ. అంత నీలానీలాళినీలాలకకేళీసౌధద్వారంబుననుండి చిఱ్ఱ చిఱ్ఱలాడుచుఁ జుఱ్ఱచుఱ్ఱం జూచుచున్నంగని వెన్నుండు వెఱ్ఱ పింపఁబోయి వెఱ్ఱచినట్లుండె. నింక నీకొమ్మ సమ్మతిపఱచి తేవలయునని కొమ్మా నీకోసమ్ము వచ్చితి రమ్మనినఁ బలుకక చిలుకలకొలికి యలుకం దలుపు చిచ్చెల్లునవైచి యిట్లనియె.

శ్లో. జనతోద్యగచ్ఛభవతో హితప్రియా
మహితాస్వయం యదహితాభవత్యపి
మయితేకృపాసుదయి తే యమిత్యలం
న వదానృతంత్వ మవదాతకీర్తిమాన్.

వ. అనిన నక్కపటనాటకసూత్రధారుం డిట్లనియె.

సీ. అలుకజాలించవే పలుకుచెల్లించవే
తలుపుదీయించవే తలిరుబోఁడి
యకట ! నీవాఁడ నే యనృతంబులాఁడనే
పరుల నే వేడనే తరళనయన
మాటాడరాదటే మరిప్రేమ లేదటే
మొదజాలిగాదటే యిందువదన
మొదాకకోపమే యదియేమిపాపమే
యింతకేమోసమే దంతిగమన

గీ. గడియయుగమయ్యె దీయవే గడియ వడతి
జాగుసేయకు బంగారుతీగెకాన
చలముదగునటె చిలుకలకొలికి నీకు
వేళమించెనురాగదే బాలనీల.

క. వలమురిదాలుపుదార యా
వల బిలువఁగ నీలఁవలదువలదని పెనఁగన్
జెలికత్తె గదిమి నీకిటు
వలెఁగూడదటంచు దలుపువడిగాఁదీసెన్.

శా. ఆవేళన్ హరినీలనీలకచ నొయ్యం డాసి బాలామణీ !
రావే బాలకురంగలోలనయనా రావే మనోహారిణీ !
రావేయంచుఁ గరంబున న్మదకరీంద్రం బాత్మపూజార్థమై
పూవుందండయుఁబోలెనెత్తికొనియెన్బోటుల్ముదంబందఁగన్

వ. ఇప్పగిది ముగ్గురుమగువ లగణితానందంబు నొందించి యజ్ఞ
గదీశ్వరుండు.

సీ. శ్రీవత్సకౌస్తుభశ్రీవైజయంతీస
దురముతోన కిరీటశిరముతోడ
మకరకుండలవిభా మండితనిజ గండ
తముతో సౌవర్ణ పటముతోడ
శంఖచక్రగదాసిశార్ఙ్గయుక్కరయుగ్మ
యుగముతోఁ జిఱునవ్వుమొగముతోడ

బహుతరబ్రహ్మాండ భాండపూరితమైన
బొజ్జతో బాపరాన్నెజ్జతోడ

గీ. అక్కమల యక్కు నెక్కు తళుక్కుమనఁగ
వసుమతీనీల లుభయపార్శ్వములమెఱయ
గరుడహయమెక్కి హిమగిరికడకుఁ దరలె
దాసులకుఁ గల్పకము వంటి తమ్మికంటి.

ఉ. మించులతేటమించు నవమేచకమేఘము బూనివచ్చు బ
ల్కాంచనశైలమో యనఁగఁ గాంచనగంధులచెంతనుంచు న
క్కాంచనచేలుదాలిచి నగంబులు రెక్కలగాలిఁ బొండు రే
ఖాంచితలీలఁగాంచవిహగాగ్రణిఁ బ్రాలె హిమాద్రిపై వెసన్.

గీ. అక్షయాజాండ భాండము లుక్షిఁదాల్చు
విశ్వమయుదాల్చె వీపున వినతకొడుకు
వినతకొడుకును హరినిదాల్చెను హిమాద్రి
స్వామికృపగల్గ నెంతైనశక్తిగలదు.

ద్విపద.

అగనేత యటఁజాలహర్షంబుచేత
మగరూతిజగజంపు మకుటంపువాని
మొలకనవ్వులవాని ముద్దునూగారు
తళుకుచెక్కులవాని తమ్మిపూవన్నె
కన్నెజెన్నగు సోగకన్నులవాని
క్రొన్నెలతోఁబుట్టు క్రొంజిగిసొగసు

కళలుగుల్కెడుమోని కపుతాళివాని
వలిపెబంగరు వల్వవలెవాటువాని
నమరారుకెంజాయనడుగులవానిఁ
జామనిచాయమైచకచకలవానిఁ
గొలిచినవారికిఁ గొంగుబంగారు
తలఁచినవారికిఁ దంగేటిజున్ను
పిలచినవారికిఁ బెరటికల్పకముః
కొలఁదిమీరినమంచి గుణములప్రోవు
నారాయణస్వామి నతచిత్తగామి
కారుణ్యమయమూర్తి కమలానువర్తి
పరమాత్ముహరి పరాత్పరునియనంత
గరుడవిష్వక్సేఃఘన భక్తిసేవ్యుఁ
గనుఁగొని వినయంబు గదురఁ దత్పాద
వనజాతయుగళిపై ప్రాలిహర్షాశ్రు
జలములు చిలికించి సలలితప్రేమ .
దొలకించిపులకించి తోయజాక్షుండు
లేవనెత్తఁగ భక్తి లేచి యిట్లనియె
దేవర లరుదెంచితిరిగాన తొల్లి
నేజేయుపుణ్యముల్ నేడుఫలియించె
నాజన్మ మఖిలవర్ణనకెక్కెనయ్య
నాభాగ్యమేమందు ననుఁగన్నతండ్రి

నీభక్తసులభత నీమహత్వంబు
నే నెంతవాఁడ వర్ణించఁగానేర
దీనపోషక సర్వదేవతారాధ్య
పతివిపిపీలికా బ్రహ్మపర్యంత
మతులితకృపయొక్కటేఁ గాదెమీఁకు
నాపెన్నిధానము నాముద్దులయ్య
జేపట్టితివి దయఁజెందుముకుంద
శ్రీకృష్ణగోవింద చిన్మయానంద
నాకోర్కెలీడేరె నన్నేలవయ్య
పాదసంభవగంగ పాద్యమేమిత్తు
నాదరానర్ఘ్యాత్మయర్ఘ్య మేమిత్తు
ననుచు మాణిక్యసింహాసనంబిచ్చి
తనబోటితోఁ బూజఁదనరఁగావించి
తనయను మ్రొక్కించి దయమీరదీని
నీబిడ్డగతిఁజూడు నిఖిలేశ యనిన
నాబాలదీవించి యచ్యుతుండనియె
గంగ, నావినికూఁతు గాఁదగునీవ
రాఁగన్నమైననే ననుజగాఁజూతు
ననుచు నమ్మేనాహిమాద్రిపార్వతుల
ననితరలభ్యదయా దృష్టిజూచె.

సీ. బ్రహ్మాదులకుఁ గానఁబడనివాఁడే తెంచె
    నగనేతభాగ్యమే మనెడువారు
నీభక్త సులభత యింతింతయనఁగరా
    దనుచు నత్యాశ్చర్యమందువారు
నీదేవదేవుని పాదముగనుగొంటి
    మహాహా! మాపుణ్య మేమనెడువారు
స్వామి వేంచేసె నీశైలజ కల్యాణ
    మఖిలలోకోత్సవంబనెడువారు
నగుచు జనములుఘనవక్షు నంబుజాక్షుఁ
గనకమయచేలు మునిలోలు వినుతశీలు
మనసిజాయుత శతరూపు మథితపాపుఁ
గనిరి మనసారఁ గన్నులకరువుదీర.

వ. అంతననంతశయనానంతతమకాంతిసంతానంబున హిమవంతు పురంబాద్యంతంబంతయు నల్లగలువతోరణంబులు గస్తూరి కాలేపనంబులనీలంపుమిన్నపనుల శృంగారించినట్లు శృంగారరసాక్రాంతంబై యుండమఱియు హిమగిరియుఁ బన్నీటిధారా సేచనకసేచనంబులం బ్రోల్లసన్మౌక్తిక రంగవల్లికల నగణిత మణి దీపకలాపంబుల నతివిచిత్రచిత్రంబుల గల్యాణహేతు కేతువుల సమస్తసౌధంబు లలంకరింపించె; నట పశుపతి కతి పయ ప్రయాణంబుల హిమగిరిపురిదరికి నభిమతశుభమహా విభవంబునవచ్చి యచ్చేరువమ్రుదువనంబగు తదుపవనంబునం

దిగి జగతీసురయుగళంబు పుత్తెంచినవారనిన వారితోనంద పూరితులై పెండ్లివారిచ్చోచ్చె జెన్నారమీయాగ్రామంబునడిగి యున్నారని విన్నవించిన నాయగనేత పాయఁగరాని వేడ్క సకలసౌరభ్య నిలయ మలయ ఘన మహిమావంధ్య వింధ్య సద్గుణరత్నసుందర మేరుమందరముఖబంధురుండై, విహంగ పుంగవతురంగగామియగు శ్రీమన్నారాయణస్వామినిముం దర నిడుకొని, జయవిజయ నంద సునందాదులంగలసి ముకుందముసలధరమైనాక కోలాహాలు వేత్రహస్తులై యుభ యపార్శ్వంబుల బరాబరులుసేయ నియమించి సుందరమణి తుందిలంబులగునందంబుల నందంబులం జెందు శ్రీభూనీలా దేవులంగొల్చి మేనకాదిశుద్ధాంతకాన్తాసంతానం బనేకపుర సువాసినీజనంబులతో నేతేరనియోగించి; గంధగజ వ్రజంబు లంతశ్శైలజాలంబులుగా సముత్తుంగ తురంగంబులు తరం గంబులుగా దివ్యరత్న స్యందనబృందంబులు మణీద్వీపంబు లుగా సముల్లసితంబులగు పల్లకీలు వాడలుగా మదాతిరేక పదాతి సముదయంబులు మత్స్యకచ్ఛపగ్రాహవ్యూహంబుల ననుకరింప, నపారవారాంగనావారంబులు జాయమానాప్స రోమానవతులుగా గంభీరభేరీ మృదంగ కాహళ వేణువీణాది రవంబులు నానాగంధర్వ గానంబులు మేదినీసురాశీర్వా దంబులు వందిమాగధవారంబుల కైవారంబులు సైన్యకల కలంబులంగలసి మహాంబుధిఘోషంబుగా పాలసముద్రంబు

వచ్చుతరిసహితంబుగాఁ దరలివచ్చినట్లుండె సాయంసమయ
మూట నవ్వారిగానివ్వటిలు దిశిటీలు చంద్రజ్యోతులు
పీతాంబర నేత్రమిత్ర నిశాకాంతాకాంతులఁ బోలిచెలు
వార నుదారంబులగు దారాజివ్వలు తారాపదంబునకెగసి
యచ్చట చిటిలి యనేక స్వచ్ఛగుచ్ఛంబులై మరలి మరలి
తదుత్సవేక్షణంబునకు నక్షత్రగణంబుల దోడ్కొనివచ్చినట్ల
మెఱయు, మఱియుఁ గొన్ని సర్పాకారారంబులై చంద్రజ్యో
తులును బహుచంద్రబింబంబులుగా దలఁచి విధుంతుదుండు
దనపుత్త్రపౌత్రబంధుమిత్ర పరివారంబుఁగూర్చుకొని క్రోధా
గ్నిజ్వాలలతోవచ్చి వహ్నిమయ చక్రంబులంగని సవిస్ఫులిం
గంబులగు చక్రిచక్రంబులుగాఁదలంచి యంతర్హితంబులయ్యె
నోయన నడంగఁ మాటిమాటికి నీటమునుంగుచుఁ దేలుచు
నెట్టుగను దురుసులగు నీటిబిరుచులరూపంబున యనలుండు
దనకృపీటజన్మతఁ దేటపఱుప మఱియు నకలంకంబులగు
లంకాపురులు దిక్కాంతలు నివ్వాళిద్రిప్పినచొప్పున నొప్పు
చుండె; నుభయపక్షంబులు గలసి ప్రత్యుత్థానాభివందనా
లింగనాద్యుచిత సత్కారంబులుగావించి పన్నీర పటీరగంధ
సారపటవాసాది పరిమళ వస్తువిస్తారంబు నెరపి కస్తూరికాది
సువస్తుకదంబంబులం గదంబించి నగంబురాతాంబూలం
బులం జాంబూనదాంబరంబులం బరితుష్టులై కొంతదడ
వచ్చట యచ్చరలయాటపాటలకు మెచ్చి లేచి పెండ్లికొడు

కును ముందరనిడుకొని ముకుందునాజ్ఞాక్రమంబున మగిడి పురికి నడుచునప్పటిసందడి-నూపరవినోదపరతఁగొంద రౌర! మహోదారవారణఘట లయ్యారే! యెయ్యారంబులగు గుఱ్ఱాల ఫౌజులాహా రథవ్యూహాతిశయంబులని యుభయ విభవంబుల కరుదందువారును గొందఱిని కప్పురంపు దిప్పలివి వియత్తరుపు చెరువులివి పన్నీరు మున్నీరు లివి దుర్దమ మలయజకర్దమంబిచ్చుట జానుదఘ్నంబిచ్చుటకటిదఘ్నంబిచ్చుట కంఠదఘ్నంబని వెఱగందువారును గొందఱు కాముకులు సుందరీశనుస్పర్శనంబుకొఱకు ముందువారాంగనా మధ్యమునుండియంతకంతకు సందడి బలువైనఁ దన్మధురాధర పయోధర ధరాధరంబులంజిక్కి క్రిక్కిరిసి యుక్కిరిబిక్కిరియై ధరణింగాళ్ళందక పక్కిజిక్కి నెక్కి సామిపాదంబులకు మ్రొక్కి తదీయసమ్యక్కరుణాయుత్కలిత దృక్కలాపంబున బయలెక్కువారును, కొందఱు చెట్టుగట్లు శైలంబులు సాలంబులెక్కి తదేకతానతమహోత్సవం బీక్షించువారును నగు నప్పుడప్పుండరీకాక్షుం డింద్రచంద్రజయంత వసంతనలకూబరమైనాకకోలాహలాదులఁ మఱియుగంధర్వవరులనంతరాతరంబుల సమరసమరక కమలాస్యాలాస్యాతిశయసారస్యంబుల నడిపించుచు నడవకట్టడిజేయించి విరించి హేమాచల సనకసనందన వశిష్ఠాదులతో నల్లనల్లనఁ బెండ్లికొడుకుం దోడ్కొని పౌరనీలాలకాజాలకంబులు సౌధజాలకంబులనుండి ముక్తా

తుతకుసుమజాలకంబులు జల్లఁగాఁ జల్లగా నడుచుచు హిమవంతునంతఃపురః పురంబుదరియంజని శుంభద్రంభాస్తంభయుగళీబంధురమణిద్వారబంధంబు రాజముఖీకర రాజిత మణిరాజనీలాజితుండై జెలువారు పెండ్లికుమారు దక్షిణపాదంబుమున్నిడినట్టుగా దాటింపించి నూతనరత్న దుర్నిరీక్షానంతకక్ష్యాంతరంబులు నిర్వర్తించి వైవాహికలక్షణ కారణమకరతోరణశుభాసక్తముక్తావితాన వితాన మంగళతరంగ వల్లికాప్రోల్లసద్వేదికా చిత్రవిచిత్ర సుందరంబగు వివాహమందిరంబుబ్రవేశించి, యప్రతిబింబవిచిత్రకంబళాస్తీర్ణ శోభితంబునుననేక యోజనాయుతంబునై యొప్పునప్పరిణయశాలయందున ముకుందుండ నఘ్యసింహాసనంబునం గూర్చుండి త్రిలోకజనంబుల నుచితస్థలంబులంగూర్చుండ నియోగించి యాటపాటలవినోదంబు వీక్షించుచునంత.

ఉ. క్రొమ్ముడి వీడ హారములు గుబ్బలబాతరలాడ మధ్యభాగమ్ము జెలింప నూపురులు గాఢతరంబుగ మ్రోయఁ జెక్కులన్నెమ్మొటజెందఁ గంకణమణిక్వణనం బిరవొంద వేలుపుంగొమ్మ యొకర్తు శంకరునకున్ దలయంటె ననేకభంగులన్.

క. లలనలు శివునకు గంధా
మలకం బిడిజలకమార్చి మడుగిచ్చి సుభూ
షలలంకరించి శోభన
తిలకంబిడి కజ్జలంబు దీరిచి యంతన్.

సీ. తలయంటె నీలకుంతలకు వింతగనొర్తు
జలజలోచనకొత్తుఁ జలకమార్చె
దడిమొత్తె మేనఁ బుత్తడిబొమ్మ కొకొ్కతుఁ
చెలువంపు మడుగిచ్చె చెలువ కొత్తుఁ
మణిభూషలంగనా మణికిఁ గూర్చె నొకతుఁ
కలికిబొట్టిడె ముద్దుకలికొకతుఁ
పువ్వులుసిగజుట్టు బువ్వబోఁడికొకతుఁ
శివుచెంతఁగూర్చె నాశివ నొకతుఁ

గీ. చిలికిజేసిజలముచే దొలచిపటంబు
నొత్తిమానికముల యొరఘటించి
పొసఁగఁగుంకుమమునఁ బూలబూజించి సు
మాస్త్రుఁ గూర్చు మోహనాస్త్రమనఁగ.

గీ. గుభులుగుభులని దేవదుందుభులుమ్రోసెఁ
గూడిగంధర్వకిన్నరు ల్పాడి రాడి
రచ్చరలు పూలుగురిపించి రమరవర్యు
లచటివారెల్ల నతిచిత్ర మందిచూడ.

ద్విపద.

ఆవేళ వాసుదేవాజ్ఞ చేబ్రహ్మ
దేవుఁడాచార్యుఁడై దేవతావరులు
సనకాదియోగులు సప్తర్షిముఖ్యు
మునులు నరుంధతీ ముఖ్యభామినులు

కన్నులపండువుగాఁ జూచుచుండఁ
బన్నుగానంకురార్పణము గావించి
ఫలదానములు ద్విజప్రతతికామోద
ములయనిప్పించి వేదోక్తమార్గమ్ము
వరలఁజేయుచు వధూవరులమధ్యమునఁ
దెరవైచె సిగ్గను తెరచేత మున్న
నోరజూపులజూచు నువిదకువచ్చె
వేరొక్క తెరయని వెలఁదులునవ్వ
నంత "వధూవరాభ్యాంవరదాభ
వం తనికుర్వంతు వాంఛుంగళమ్మ"
టంచుభూసురులు లగ్నాష్టంబులుప
ఠించఁగా దెరయెత్తి ఠీవిసంతోష
శరనిధి తెరయెత్తె సతికీశునకును
మరుఁడప్పుడిరువుర మర్మంబులేపె
వారిచూపులె శర వారములఁ జేసి
వైరంబుజనదెంత వారికికైన.

వ. భేరీలుభూరాలు నీరంధ్రముగా భోరుకొలగివడి చెలఁగి వెలం
గెనట మఱియు.

ద్విపద.

హిమవంతుఁడంతట నింతియుఁదానుఁ
గమనీయగుణదొడ్డ గారాపుబిడ్డ

చెలఁగి ప్రత్యక్షలక్ష్మిపూజచేసి
కొలువున్న ముద్దుల గుమ్మలేగొమ్మ
యలఘులజ్జాభరం బధికమైయుండ
దలవంచికొనియున్న తనచిన్నిగౌరి
ముందరనిడికొని ముక్కంటియడుగు
లందంపుఁబళ్లెరంబుదునఁ గడిగి
సాలంకృతముగఁ గన్యాదానమిచ్చె
నీలకంఠుండు పాణిగ్రహణంబు
గావించె నించువిల్కాఁడు ఝళిపించు
మానితేజిగురు జొంపపుతరవారు
దొరకించుకొన్నట్లు తొయ్యలికంత
సిరమున నిడె గుడజీరంబుమదనుఁ
డళిబలంబుల కిడు నాహారమనఁగ
సలలితక్రమ మొప్ప ననికంటిమీఁద
దరుణిని సప్తపాదములు ద్రొక్కించె
హరుఁడు స్వకీయపూర్వాపరాధములు
పరిహారమొనరించ బ్రతిమాలుకరణి
మరునిజేగంటనా మంగళసూత్ర
మంగనామణికంఠమందుంచి యొసఁగ
మంగళస్థితి సర్వమంగళాగళము
నందుఁబొందుగఁగట్టె నన్యోన్యతనువులందు

గగుర్పొంద నర్థేందుమౌళి
బాలికముత్యముల్ బట్టి దోయమ్మల
కూలంకషోన్నత కుచము లుప్పొంగ
నడుము వడంక సుందరపు ముత్తరులు
మడతలువిడివడ మగనిమోదలను
తలఁబ్రాలుబోసె హస్తయుగంబుసాచి
కలికిపైఁ దలఁబ్రాలు గదియించె ధవ్రుఁడు
కొమ్మలుతోఁబుట్టు గులును మాయమ్మ !
లెమ్మ లేలెమ్మ ప్రాల్పింపుసింపనుచు
నెచ్చరింపఁగనించె నీశునిమౌళి
నుచ్చరింపుచునించె మగువపై మగఁడు
దలపించె హరికి శ్రీతరుణికి కలశ
జలనిధి క్రీడలోజల్లుపోరాట
తలఁబ్రాలముత్యముల్ తారకలాయె
నలమినుసిక వేల్పు నౌదలయందు
ఘనవేణిశిరమునం గరకాళియయ్యె
ఘనతరలీలఁ దత్కౌతుకవేళ
మును బ్రహ్మయానందమును బొందు చెంత
జనులు బ్రహ్మానందసంపద గనిరి.

వ. అప్పుడు పేరఁటాండ్రు పాటలుబాడిరఁట యెటువలెను.

శ్రీమహాలక్ష్మిని శ్రీకృష్ణుఁ బోలి
తామరతంపరై దగిరి దంపతులు॥ ౧॥
గౌరికల్యాణమే వైభావ్యమే
లక్ష్మీకల్యాణమే సౌభాగ్యమే
పూవుఁదావియు బొందినయట్లు
లీవధూవరులందు రేఁచి యెల్లప్పుడు॥ ౨॥
కలిగిమాగౌరమ్మ కడగంటిచూపు
కలువపూవులదండ గద శంకరునకు॥ ౩ గౌరి॥
చెమ్మగపూవుల చేరత్తినట్లు
కన్నెమాగౌరమ్మ కాపురంబొప్పు॥ ౪ గౌరి॥
కడువేడుకలచేత కడుపుచల్లగను
కొడుకులకోటవై కొమరొందవమ్మ॥ ౫ గౌరి॥
వెలయంగఁదగుచోట్ల వియ్యంబునొంది
కలకాల మఖిలభోగముల వర్ధిల్లుఁ ౬ గౌరి॥

మారువరాగం—ఆదితాళము.

శోభనమీశ్వరునకు-శోభనమే పార్వతికి
శోభనమీకైలాస శుభమందిరమునకు॥శో॥
మణితతులహారతులు-మదవతులు మీరియ్యరమ్మా
మణియుతుఁడు శివ్వన్న మగువగౌరమ్మకు॥ శో॥

వ. పాటలగంధులు నివ్వాళిపళ్లెరంబులుబట్టి పాటలు బాడిరఁట యెటువలెను.

మంగళగౌరిరాగం—ఆటతాళము.

మంగళము పుంగవతురంగవరసాంగునకు
మంగళము మాసర్వమంగళునకు
మంగళము తుంగరవభంగ రంగదభంగ
గంగోత్తమాంగునకు గౌరమ్మకు॥ జయ॥
గౌరీసత్కృత కేళి-కారుణ్యపాలిని రేజసిపుమాళి
నీకునివ్వాళి-నివ్వాళిమగో గౌరమ్మ
నీకిచ్చెముగై కొమ్మ-శివ్వన్న ముద్దులగుమ్మ
చిన్నిబంగారుబొమ్మ। నివ్వాళిః
దోయజాక్షునిచెంతతో మరుగు శ్రీకాంత
కాయజునితల్లి శృంగారవల్లి
యాయువును శ్రీయుజెలువారునైదువతనము
స్థాయిగా గౌరికే దయజేసెను॥ జయమంగళం।

వ. అప్పుడు భృంగి యంగనాక్రమంబునఁ గొప్పు దిద్దికొనుచు పయ్యెదసవరించిన యట్లసవరింపుమనందఱికవ్వించి పార్వతి సన్నిధికివచ్చి యింతదలంచినదానవు నాఁడు మాబెదరింపుల కేల లొంగుదువు తొటాకుచప్పుళ్ళకుఁ గుందేళ్ళు బెదరునె నాఁడు దైవగతిని మీకొక్కటైన నాపై దయయుంచవలెనని గట్టిచేసుకొంటిఁగదాయట్లు దయయుంచెదవో లేకచీకాకుగా వించితినని కోపగించెదవో కోపగించినఁ బన్నెండామడ పారి పోదు సెలవిమ్మనిన నగజనగవడంచికొని తల వంచికొని

యుండఁగోపంబున్నట్లయున్న దదియనొక్క తేపనైనను జూడ వైతివి నేనిఁక నిలువ నూరుమార్గంబు బట్టెదనని లేచిపోవ గలవాణినవమాలికలునీపై కోపంబేలవచ్చుకల్యాణకాలంబు గనుక సిగ్గుననిట్లుండె నిలునిలుమనిన వాడుబ్బి నాపనిబాగా యెననిగంతులువైచుచు వేశ్యాజనంబుల వెక్కిరింపుచు వైశ్యులజడిపింపుచునుండెనంత హిమవంతుండనంతామరానంతామరలకుఁ జందన తాంబూలాద్యష్టప్రశస్తవస్తువులొసంగెఁ దదనంతరంబ.

ద్విపద.

వాసుదేవుండంత వామభాగమున
వామలోచనయుండ వహ్నివిధ్యుక్త
హోమంబు సేయుచు నువిదడాయుచును
వామార్ధజానిత్వ వాంఛచే బల్కె
చెలువొందఁ జెలువయు సిగ్గుననొదిగి
వెలలేని తనకూర్మి వెలిజేయకుండ
చూచియుఁ జూడని చూపులచేతఁ
బూచిపూయని హృదంభోజంబుచే త
నంటియంటని యవయవములచేత
నొంటినొంటిని మనోజోద్వృత్తిచేతఁ
గూడియుఁ గూడని కోరికచేత
వీడియు వీడని వేదనచేత

దంపతుల్ వాగగోచర భోగరాగ
లంపటులై రంత లాజహోమంబు
నలువజేయించె మైనాకుఁడింపొంద
వెలయస్థాలీపాక విధులుగావించి
కులదేవతను నిల్పికోరిక చేతి
నలువొందు నలయరుంధతిని జూపించి
భగవదర్పణ జేసి బ్రహ్మాదిసురలు
కగణితద్విజపాళి కఖిలలోకోత్త
రమ్ములదిను నగరాజమర్పించెఁ
గమ్మని నేతులు కాల్వలుగాఁగఁ
గాయపప్పులు మాచి శాల్యన్నములును
గాయగూరలు చార్లు కలగాయపులుసు
లూరగాయలు రుచులూరుపచ్చళ్లు
బూరెలు కక్కరాల్ బూతప్లుగారె
లరిసె లప్పాల్ మొదలై నభక్ష్యములు
పరమాన్నములు పండ్లు పానకాల్ వరుగు
లప్పడాల్వడియంబు లలరుతిమ్మనము
లొప్పగుపెరుగుపా లొప్పులకుప్ప
లపరంజిపళ్లెంబులందు వడ్డింప
నపరిమితప్రీతి నపుడారగించి
యందరువీడ్యంబులంది సౌధాగ్ర
బృందంబులంతిన బెంపొందిరంత

ద్విపద.

అంత కాంతలు మంగళా క్రాంతగతుల
కంతదెచ్చిరి రత్నకాంత పాత్రముల
ప్రాకెన్నఁజేసిరి బ్రహ్మాదులెల్ల
ప్రాకటాశీర్వాద ఫణితులుమీర
దొంగవేలిమిజేసి దొంగిలేశర్వ
డంగనామణి సరసాంతరంగంబు
ఆనాల్గుదినము లత్యానందభరిత
మానసులై బహుదానంబులంది
భోజనాదియథేష్ట భోగంబులంది
తేజంబునొందిరి త్రిజగతీజనము
దంపతులకు సురతరుణులామోద
సంపదబెట్టిరి జాభరాసలుగు
మగనిపేర్మగువను మగువపేర్మగని
తగజెప్పుమనుచును దలుపులువేసి
పాటలుబాడుచుఁ బరిహాసితంపు
మాటలతేటల మాటిమాటికిని
చెలఁగిరైదవనాఁడు శేషహోమంబు
సలిపినాకబలికై సమకట్టిరంత.

వ. అప్పుడు గప్పురగంధులు పెండ్లికొట్నంబుల పాటలుబాడి
రట యెటువలెను.

కలికిరావె చిలుకల-కొలికిరావె ముసురా
చిలుకరావె వజ్రంబు-పలుకరావె। ౧।
యింతిరావె గొజ్జంగిబంతి-రావె రత్నాల
దొంతిరావె మదనుని-దంతిరావె।। ౨।।
కొమ్మరావె బంగరు-బొమ్మరావే చివురుతే
గొమ్మరావె ముద్దులగుమ్మరావె। ౩।।
కన్నెరావె కప్పురంపుదిన్నె-కొనరావె నీవు
వన్నెగన్న చిన్ని-పొన్నగున్నరావె। ౪।।
పచ్చికస్తూరిరావె-పన్నీటికుప్పరావె
పచ్చవిల్తుదేజపండ్ల-పనసరావె।। ౫।।
చెలియరావె చేడెరావె-చిన్నిరావె పొన్నరావె
వెలఁదిరావె కొట్లములు-వేగదంచము। ౬।।
గరుడవాహనములుమంచి-గొరికెంపులురత్న
సరులుపచ్చగన్నేరు-లుసన్నదినుసులు। ౭।।
కలయఁగూర్చి కరములంకుఁ-గంకణక్వణములుమెఱయ
నలరుటందెలెల్ల-ఘల్లురనగదంచిరి।। ౮।।
సువ్విసువ్విసువ్విసువ్వి-సువ్విసువ్విసువ్విసువ్వి
సువ్విసువ్వన్నసువ్వలాలరె।। ౯।।

ద్విపద.

అంగనావళిదీర్చి నట్టిముత్యాల
రంగవల్లికచిత్ర రచనచే మెఱయ

నాగప్రసాన్వియైన యరుంధతియును
వేగఁదద్వ్యథులెల్ల వెలయఁగఁదీర్చి
యాకుగంటము చేతనందులిఖించి
జోకగా శశిమౌళి సుదతితోనుండ
హారియిచ్చెకట్న మష్టైశ్వర్యములను
హారునకుఁబార్వతి యతులితప్రేమ
మామయల్లునికిచ్చె మణికిరీటాది
సామగ్రివస్తువుల్ చదివించిరప్పు
డామనిగాఁగ బ్రహ్మాదులునంత
కూరాడుఁనీరాడు గొబ్బునదోణకి
యాహాఢిపాన్పెక్కి యాసతిపురుషు
లుయ్యలలోఁ బొమ్మ నుంచి వసంత
మొయ్యనఁజిలికించి యుపిద లవ్వేళ
జోజోకుమార జోజోచిన్నియన్న
జోజోననుంగన్న చొక్కపుతండ్రి
యనుచుఁపాటలు బాడిరటదంపతులకు
మునుమునుమిఁఘనతాంబూలంబులిచ్చి
రంతవసంతంబులాడిరందరును
కంతుగురుండు శ్రీకంఠునిమీఁద
సంతసమంది కాంచననాళములను
మరిదివావిమొనర్చు మాధవస్వామి

హారువుమీఱ గుంకుమాంబువుల్చిమ్మ
గనకాంబరచ్ఛవి గౌస్తుభప్రభలు
గనుచువసంతంబు కంజాక్షుమీఁద
చిలికితినని సదాశివుఁడూరకుండఁ
గులశైలసుతమీఁది గుంకుమరసము
శ్రీమహీనీళలు జెలరేగినించఁ
దామరసాక్షుఁడు దైతలడాసి
మూఁడుచేతులచేత మువ్వురఁబట్టి
తోడఁబుట్టువటంచుఁ దొయ్యలిఁబిలిచి
నాలవహస్తంబున న్వసంతంబు
లీలనందిచ్చియాలేమలమీఁద
గొఁ చేనిప్పించి కలకలనవ్వె
శారదమేనక సరసంబులాడి
రజహిమగిరులు సయ్యాటలదగిలె
ద్రిజగతీజనమెల్ల దివ్యాప్సరోమృ
గాక్షులతోఁ జల్లురాడిరాగాబ్ధి
నాక్షణంబున నోలలాడె నట్లుండె.

వ. అప్పు డప్సరోవరవర్ణులు కుంకుమరసచూర్ణపూర్ణలై చిత్తజుండు తత్తరిల్లక విరహులమొత్తంబుం గ్రుచ్చిన క్రొత్త విరికత్తులం బోలి నృత్యంబులు సలిపిరఁట యెటువలెను.

సారంగరాగము—ఆటతాళము.

రారె చెలులారవీరందరురారె సఖులార॥ రారె॥
రారెసఖులార-సాలేశ్వరునితో వసంతమాడుదాము॥ రారె॥
చెన్నగువన్నిరుచిమ్మాల గ్రోవిలోవన్ని మనచెలువుని
పై నిజిమ్మదాము॥ రారె॥
కుంకుమబుక్క భర్గుండకర్పూరము
పొంకముగాఁ జేతబూనిగుప్పుదాము రారె॥
మల్లెలుజాజులు మొల్లలుగొజ్జఁగులు
మొల్లముగామనము చల్లులాడుదాము॥ రారె॥

ఆ. వె. భూరియొసఁగె భూరిభూరిమహాభూరి
సంఖ్యకెచ్చు విప్రజాలములకు
ఘనతవిద్యధార్యకవిగాయకనటాది
కమునకిచ్చె వాంఛితముహిమాద్రి.

ద్విపద.

అప్పుడు విడిదికిఁ గిపార్వతిని
నప్పగించుటకు భిన్నాత్ముఁడై వగుని
చేతులోఁగూతురి చెయివేసిపలికె
నాతండ్రిపరమేశ నాకునీవంటి
యల్లుడుదొరికినాఁ డధికభాగ్యంబు
తొల్లిటినాతపస్తోమంబుపండె
పనులేమినేరదు పసిబిడ్డగోల

దినదినంబుననీవె దిద్దుకోవలెను
మీరెఱుంగనియేమి మిన్నకనేను
గారాముచేఁ గన్నకడుపౌటనంటి
భారమెవ్వరిదని పార్వతినిఁజూచి
నారీజనమతల్లి నాతల్లినీకు
ధవుఁడన్న గురుఁడన్న దైవమటన్న
నవనిధులన్న నెన్నఁగసదాశివుఁడె
యతిభక్తిఁ బతిమాటకడుగుదాటకుమి
యతివకుసతమైనగతియనుచు
భూరిచింతాక్రాంతబుద్ధిగద్గదిక
వారిజాక్షునితోడ వలిమల బలికె
నారాయణస్వామి నన్నేలినయ్య
కారణకర్తవుగదయందఱికిని
నీయాజ్ఞ చేసయ్యె నిఖిలమో దేవ
తోయజభాండముల్ దొంతులకోలఁది
కడుపులోనుంచి నఘనుఁడ నాయన్న
పడఁతినీపట్టిగా భావించి కరుణఁ
గనిపెట్టవలెనని కన్నీరునించ
జనులకెల్లను నేత్ర జలములుదొరిగె
జాలినవ్వనమాలి జయశాలిబలికె
నేలనీకీచింతహిమవంత! యింత

యేకశరీరులై యీాయుమాహరులు
జోకనుందురు శుభశోభితులగుచు
లోలాక్షినిచ్చి యల్లునిఁ గొంటిననుచు
లాలనజేసె శ్రీలక్ష్మీశుఁడంత.

వ. అప్పుడు మేనకాహిమవంతులు సుతనత్తింటి కనుచుటకు
జాలి నిట్లనిరి.

సీ. బొమ్మలపెండ్లిండ్లు బొట్టెలఁగూర్చక
నెవరుజేసెదరు మాయింట నికను
చిన్నారిపొన్నారి చిన్నెలపిఁనోము
లెవరునోచెదరె మాయింట నికను
పల్కు చిల్కలకెల్ల పద్యముల్చెప్పుచు
నెవ్వరాడేరు మాయింట నికను
ప్రాణపదంబుగా బహుపుష్పజాతుల
నెవరుప్రోచెదరె మాయింట నికను

గీ. చిన్నబో నిల్లు నీవులేకున్నక్షణము
పాలఁ తినిత్రోడనే ప్రొద్దుపుచ్చుకొందు
నింతలో నిన్ను నత్తవారింటికనిపి
తాళఁగలనటె యోసి! నాతల్లికూన.

గీ. అమితభాగ్యుండు కలశాబ్ధియల్లుఁ డీశ్వ
రేశ్వరుఁడు ప్రేమతోఁ దనయింటనుండె
పాపుఁడను నేను తామసపరుఁడుహరుఁడు
బొట్టెగొనియుండు మెఱుఁగురాల్మెట్టమీఁద.

వ. అని జాలింబడు శైలరాజుం జూచి తమ్మినాలి మొదలగు వారు జాలి నీ కేల నీలకంఠుండు కృపాళుండు నీయిచ్చవచ్చి నప్పుడిచ్చటికి వచ్చుపుమచ్చిక మెచ్చుకంటితో వచ్చి మనసు వచ్చినన్నాళ్ళుండునని యూరార్చిన సమ్మతించి కూతునకు నల్లునకు నపరిమిత కరితురగ రథపదాతులననేకదాస దాసీ జనంబులను నగణితమణీగణంబులను దారకకనకచిత్రాంబర వారంబులనొసంగి యతిదూరంబుబంచి కూతుంగౌఁగలించి కొని యొట్టకేలకువదలి మఱియుఁదగు బుద్ధులుజెప్పి వీడ్కొలిపివచ్చి బ్రహ్మేంద్రాదిదేవతలకు వసిష్ఠాదిమునివరులకు మఱియుఁదక్కిన బంధుమిత్రులకు నపారంబులైన కానుకలు కట్నంబులిచ్చి యుచితసత్కారంబుల సంతసంబుజేసి శ్రీ భూనీళాసహితుండైన శ్రీమన్నారాయణస్వామిని షోడశోపచారంబులం బూజించితనయుండు నింపొందు ననర్ఘ్యమరకతమాణిక్యంబులు తులసీదళాకారంబుగా నమర్చి కూర్చిన మణి తులసీదామంబుచరణకంజంబులందుంచి మేనకా సహితుండయి సాష్టాంగ దండప్రణామంబుచేసి లేచి హస్తపుటి మస్తకపు తటినుంచియిట్లనియె.

ఆ. వె. వాసుదేవ భక్తవరదజగన్నాథ
పరమపురుషకృష్ణహరిముకుంద
చూరదొరకె సకలశుభములు మీరాక
జూడదొరకె మోదసుధయు మదికి.

సావేరిరాగం—రూపకతాళము.

నారాయణ పురుషోత్తమనన్నేలినివాఁడ
నీరజదళేక్షణనే నినుఁబొగడఁగలన
కనుఁగొంటిమిమీరూపము కన్నులుచల్లఁగను
వనధిసుతాదులతోడను వచ్చితి భాసిల్లఁగను
మునుపటినాపుణ్యంబులు మునుకొనిసంధిల్లఁగను
జనులెల్లనువెఱఁగందుచు సమ్మతిరంజిల్లఁగను
మునిజాలావనశీలా! ఘనలీలాలోల
ఘననీలా వనమాలాకర వక్షవిశాల
కనకవసన వన ధిశయనవినుతసనక విశ్వజనకా
ననుఘనునిగ నొనరించితి
వనఘ కరుణఁబెనగొనహరి నారాయణ.

శ్లో॥ నారాయణనమస్తే౽స్తు నళినాక్షనతామర
నారదస్తుతనఃపాహినమస్తుభ్యం నమోనమః

వ. అని వందనంబుజేసిన మృకుండుండు సానందుండై నగ ప్రభు
నకభీష్టవరంబులొసఁగి వీడ్కొని వైకుంఠపురంబురకరిగి జగ
ద్రాక్షా దీక్షాత్ముండై యరిగె నంత.

కన్నడగౌళరాగం—జంపెతాళం.

పార్వతిని పెండ్లాడిభవుండు శ్రీకైలాస
పట్టణంబునకువచ్చెఁ-హెచ్చెఁ।
సురలోకములలో జనులు బ్రహ్మాదులును

సాయములు వెంటరాఁగా బాగా॥ పా॥
అమరులంట పుష్పవర్షములు గురియింపఁగా
నచ్చరలు వేడ్కనాడఁ-బాడా॥ పా॥
తుములముగ దేవదుందుభులు మర్దెలపటహ
తూర్యకాహళులు మెఱయా-మొఱయా॥ పా॥ ౨॥
ప్రమథగణములు నుభయపార్శ్వముల డిగి
బరాబరులుసేయుచును మీరా-చేరా॥ పా॥
రమణులుసౌధజాలముల ముక్తాక్షతలు
సుమతతుల సేసలెల్లా-జల్లా॥ పా॥ ౩॥
రమణీయమణుల నీరాజనంబులుబట్టి
రమణులందంద యొప్పా-త్రిప్పా॥ పా॥
కమనీయ విప్రసంఘస్వస్తిభామినీ
కల్యాణరవము జెలఁగా-వెలఁగా॥ పార్వతిని॥ ౪॥

రగడ.

అంతట సతితో సలసును భవుఁడు, నంతిపురిందిగ నద్భుతవిభవుఁడు-బ్రహ్మనులకింపితములొనర్చెను, బ్రహ్మానందప్రాప్తిదనర్చెను-వేడుకతో శోభనవిధులటు నెఱపెను, పోడిమితోడుత-ప్రొద్దులుజఱపెను-యొక్కనిశన్ సుముహూర్తము వెలయఁగ-జక్కనిసౌధస్థలి పెంపొలయఁగ-నిలువుటద్దములు నెరచిత్రంబులు- అలరెడుగోడలు నతిచిత్రంబులు- నగరుధూపములగు జాలకములు- నగణితమృదుశయ్యా జాలకములు

తోరపువగజెందు వితానంబులు-సౌరభయుత పుష్పవితానంబులు - కుఱిచీపీటలు కురువేరులనగు - సురటీల్ సొగసునసురవారులనగు-చక్కని బొమ్మలు చతురంగంబులు-చొక్కపుసొగటాల్ శుభరంగంబులు-పలుకుచిలుకులును పారావతములు-చలనల వింతలు శారీశతములు-దలమగు మద్దెలతంబురవీణలు-కలపము కర్పూరము కస్తూరివీణలు-పన్నీరత్తరు బహువీటికలును-సన్నుతమణి భూషాపేటికలును-చదురుతివాశీల్ సరసపాత్రములు-మొదలగువస్తువు మోహపాత్రములు-దగునాహర్మ్యాంతరకుట్టిమమున-పగడపు పందిరిపట్టెమంచమున-శర్వుడుండె మృదుశయ్యాంతరమున-పార్వతిగలయగ బహుళాంతరమున.

ద్విపద.

నగజాత యనుచరుల్ నానావిధంబు
లగునలంకరణంబు లాచరించుటయు
పేరటాండ్రనుబిలుపించుట రత్న
తోరణంబులు సుమస్తోమమాల్యములు
గట్టుట సుముహూర్త ఘటికలెన్నుటయు
విట్టచేడెలతోడఁ దివిరి యేకాంత
ములుబల్కి నవ్వుట మొదలగునట్టి
బలువైనసందడి బరికించినాఁడు
చెలువునిగూర్తురు సిద్ధంబటంచు

నలవిచెందనిపజ్జ నంది వేరొక్క
మలపున నేకాంత మణిగృహాంతరము
లలితాభ్రమునఁదటిల్లత యున్నయట్లు
బొలుపైన తెరలోన బొమ్మయున్నట్లు
కలహంస కాసారకలితమైనట్లు
చిలుక పంజరములోఁ జెలువొందినట్లు
దలవంచికొనియున్న తరలాక్షిఁజూచి
కలవాణి నవమాలికయు మొదలైన
చెలికత్తె లయ్యింతి జేరి యిట్లనరి.

శంకరాభరణము—ఆదితాళము.

ఏమమ్మయోకొమ్మ యిదినీకు దగునమ్మ
రావమ్మ పనియున్నది॥ అను॥
మామీఁదఁగోపము మఱియేమి దలఁచితో
యీమందిరముజొచ్చి యిటురాకయున్నావు॥ యే॥
పిలిచిన నొకసారి పలుకవయ్యయ్యో
యిపుడె కలికి యెంతగర్వమె నెలఁతరో నీమగఁడు
నీవు నొక్కటైతె, తలఁపవులే మంచి
దానవు నీగుణము దెలిసెనులేవే
అదిగో యెగిరె చిలుకరావె మేపుదాము
ఫలములుదేవే-యేమోపంపెఁ
గులశైలపతియంచుకోవె నోసి మాయమ్మ॥ యేమమ్మ॥

వ. అని నెపంబులు వెట్టి బహుప్రయత్నంబున బాలికామణి కేళి కామందిరమునకుం దార్చిన బాలేందుధరునింజూచి కంక ణకాంచికా కటకఘుంటికాఘణంఘణలు దిక్కులనిండ గిర క్కున మరలి కలవాణి నవమాలికలు గదిమి మేలుమేలు బుద్ధిమంతురాలవని యుంటిమి నీకేకాని లజ్జ జగతిలో వారి కెవ్వారికున్నది? యిట్టివారె రేబగలు మగనినోడలుగట్టు కొనితిరుగువారని భయంబులుచూపి దోడ్కొని మహా దేవునిసన్నిధానంబున కరిగి పుణ్యాంగనాజనంబులకు ననేక ఫలతాంబూలదానంబు లిప్పించి మంత్రాక్షత దీవనలిప్పించి బాల గోల నీవు సర్వజ్ఞుండవు యేలీలమెలపుకొనెదవో నీకే తెలుసు మేము తెలుచు దెలుపనేల మీరు మీరొక్కటె మేమే వేరని చెలులకందర కన్నిపనులుగల్పించి పంపించి తాను వారెవ్వారును రారైరని తలుపు దారసిల కీలు బిగించి జనినంత.

క. తలవంచి బాలబొటన వ్రే
లిల వ్రాయుచు నిలచె నంత నించునిలుతుతూఁ
పులఁ గాలఁబట్టి నేలం
జలమున రాతునని సన్నసలిపెడుభంగిన్.

వ. అంత నక్కాంతంగని యక్కాంతుఁ డిట్లనియె.

ముఖారిరాగం—ఆటతాళము.

ఏలరావె యింకనైననన్నేలరాదె
యేలరావే యోబాల సిగ్గు లికచాలునేను నీ
మేలువాఁడనే॥ యేలరావె॥
విరహాశరధి పరిపరివిధముల వేసరియీదుచు నీ
వరకుచదుర్గనక తరుణిరో నేనీశరణమునొందితి
కరమొసంగి నను దరినిజేర్చవే॥ యేల॥ ౧॥
మరుఁడు చెరకువిలు కరమున గొని విరి
శరములు బరపెను చురుకుచురుకుమని
యురమటదూసెను పరవశమయ్యెను
గరుణనీయధరవరసుధనీవే। యేల।
కలికిరో మన తపములు ఫలియించెను
తల్పము పైననుఁ గలసి మెలఁగ కిటువలెఁ
దలవంచుకొని నిలుతురటవె చెలి కులుకుచుఁ
బలుకుచుఁ గోర్కె దీర్చవే॥ యే।

ద్విపద.

అనుచు మోహంబున నధిపుడు హస్త
వనజంబుబట్టి పిల్వఁగ బెట్టువింటి
నారినాకర్షించు నలినాస్త్రుఁడనఁగ
దారనాకర్షించు దనశయ్యనుంచ
మెఱుగుఁబోఁడి సిరంబు మిక్కిలివంచి

కటాఁగినయట్టి బంగఋముద్దలాగు
ఘనలజ్జచేనున్న కాంతుఁడిట్లనియె
వనిత యిందన్యు లెవ్వారలున్నారు
ననవింత సేయుట న్యాయమానీకు
వనజాయతాక్షి నీవాఁడనుగానె
మనసిచ్చి నాతోడ మాటాడవేల
కొంక నేటికి మనకోర్కెలుపండె
నింక సిగ్గుబడ నే హేతువులేదు
కోమలి నామీఁదఁ గోపమా లేక
యీమాట దెల్పు నా యపరాధమేమి
నాఁడు నీవనములోనఁ దపంబు చేసి
కూడకేగినది యెక్కువ నేరమయ్యె
నాతప్పు సైరింపు మంజలి జేతు
నీ తెఱంగున వేడ నేల దయరాదె
యని చుబుకముబట్టి యాననంబెత్తి
కొనగోళ్ళచేత ముంగురు లెగదువ్వి
తిలకమించుక జాఱె దిద్దుమనదటవె
కొలుకులు వదలి చిక్కులుబడనేమి
యలివేణి మౌక్తికహారములెల్ల
నలకప్పురపు విడెం బందియ్యఁగదవె
పలుకకున్ననుమానె పడఁతి నీవనుచు

నెపములుపన్ని కన్నియనుదానవంటి
యపరిమితానందుఁడై యుండె మఱియు.

సీ. మోవియానఁగఁబోవ మోముద్రిప్పినయింతి
నద్దంపుజెక్కులు ముద్దుగొనును
చెవిఁజేరి యొకమాట జెప్పఁబోవని జెలి
నయనాంబురుహచుంబనంబొనర్చు
నీవియానగబోవ నెలతకేల్గవగప్ప
జనుదోయిపై నఖక్షతముసేయు
పొక్కిలినొక్కఁగాబోవ నొసరిల
జక్కెర బొమ్మ పక్కగిల్గింతగొలుపు
ధవుడుచేర్చిన ప్రియ యవయవములందు
నొకటిగాకున్న మఱియు వేరొకటిజెంది
సతిని ననె నిది మన్మథాచార్యముద్ర
భుజముతప్పినవీపు దప్పనెయటంచు.

గీ. అతివతోడుత సరసంబులాడియాడి
చెలియమర్మస్థలంబులు జెనకిచెనకి
కాంత బతిమాలిబతిమాలికొంతకొంత
సిగ్గువడలించె బాలేందుశేఖరుండు.

ఉ. పాటలగంధికిఁగగురుపాటునఁగంచుక సంధులూడ స
య్యాటను నీవిలాగఁ బతియప్పుడె పందిరిపట్టెపుంచపుఁ
గాటపుజాలుమేల్వలువగప్పెను బాలికదాననేమగుం
డేటగఁగాంచెఁ గాంచి మణిదీపములన్ రమఃణుండుసర్వముఁ

గీ. శాత్రవునకైన నుపకృతిసల్పుకతం
చిత్తజాతుఁడె కద యుత్తమోత్తముండు
సాంద్రలజ్జావరణ మురు శక్తిబాపి
పడఁతిచిత్తధనం బీసుపాలు జేసె.

ద్విపద.

బాలికప్రియతను స్పర్శసౌఖ్యాబ్ధి
హేలలాడుచునేమి యెరుగకయుండెఁ
నారమణుఁడు మన్మథారావమెల్ల
జూరఁగొన్నట్టులు చొక్కపుతావి
మోవి తేనియలానిముగ్ధులేఁగేలు
తీవలఁ బెనగొనిఁదృఢతరోరోజ
ఫలములుగైకొని భాసురావయవ
లలితలతాంతముల న్మోదమంది
తనివిదీరక కనుదమ్ములు నొసలు
ఘనకపోలములు చక్కఁగ నొక్కసారె
బలు వేడ్కఁజుంబించెఁ బంచాననముల
పలుమోములలరించె పటుమోహమాన
సంబు ననేకదా సకలాంగకలిత
చుంబనసిద్ధికై సొబగుఁడు:మఱియు
మానినితో నవాజ్మానసగోచ
రానందమొంది యొయ్యనయనివార్య

కేళుల ? జలిఁగఱఁగింతాలఁగఱఁగి
లీలమేల్బదనికల్ పెనఁగొన్నలాగు
తనువులొక్కటిగాఁగ దంపతుల్ పాను
పుననిదురించిరిపూర్వకాలీన
విరహజాగరణంపువెతలెల్లఁ దీర
మునుపుగానే కీలుమునువన్ని నారొ
పసిఁడిబొమ్మలు రెండు పాదంబులొత్తె
విసరెఁబూసురటిచే వేరొక్కబొమ్మ.

వ. అంతనిశాంతంబున మేల్కని.

సీ. జన్నిదంబులు ముత్తెసరులుజక్కులుఁ షడ్డ
మెలులువిప్పుచుఁ గొంతమేలమాడి
తారుయారైనవస్త్రములు పూర్వాదాన
వైఖరికొక కొంతవంతులాడి
నవ పునారతయాచనానిగోధములచే
ననువుగా నొకకొంతఁబెనఁగులాడి
మునుపటినటువేషమున కతల్ తలపోసి
ముచ్చటగాఁ గొంతముచ్చటాడి

తే.గీ. నగవుబలుకుల కులుకుల బిగులప్రేమ
జిలుగుజూపులఁగోపుల కళలనెలవు
వెలయబెణకుల చెణకులవేడ్క లలర
బాహ్యకేళి యొనర్చి రప్పతియు సతియు.

వ. అంత వైతాళి యిట్లనియె.

దేవగాంధారిరాగం—జంపెతాళము.

లేవమ్మగౌరిదేవి । వేగమె శ్రీగౌరి । దేవియింకెందాక
నీవిభుకౌఁగిటను నిదురించేవమ్మ॥ లేవ॥
కమలములు వికసించి । భ్రమరపఙ్త్తులచేతకమనీయగతినలరె
కాంతయిపుడు । రమణీయమైన నేత్రముఱెప్పలుద్రిప్పి
యమితదృష్టిలోకమలరించవమ్మ॥ లేవ॥
చిలుకలునుకోకిలలు
చెలఁగి కిలకిలమనుచు పలుదెఱంగులచేత
బలుకుచునుండెఁ । పలుకుపలుకుకు తేనె
లొలుకుపలుకులచేత చెలువ
పెనిమిటిని సెలవడుగవమ్మ। లేవ॥
ఉదయశైలముమీఁద । కుదురుగా రవిబింబ
ముదయించి యరుణరుచిబోదవెనిదుగో
సుదతినీచనుదోయి సొంపునింపెడు కెంపు
పతకంబుసవరించి పడఁతిరావమ్మ॥ లే॥

వ. అనంతరంబ.

సీ. వాడినతీగెకైవడినున్న మేనితోఁ
గెంపుకన్నులనిద్రముంపుతోడఁ
బలుమొనవాటు లేర్పడినకెమ్మోవితోఁ
జెఱుచెమటంటు ముంగురులతోడఁ

జెదరుకాటుకనీటు చెక్కుటద్దములతో
నపరిమితంపు టూరువులతోడఁ
జెలువంపుచనుదోయి నెలవంకగుంపుతోఁ
దారుమారుగఁగట్టు చీరతోడ
తే.గీ. సడలు క్రొమ్ముడి కేల నింపడరదిద్ది
బడలికలచేత నడుగులు తడబడంగఁ
గడుముదంబున వెతలజ్జగడలుకొనగఁ
వెడలెఁ దేవికళవిలసిల్లు వేడ్కతోట.

ద్విపద.

ఘనతర ప్రేమగల్గఁగ సదాశివుఁడు
దినదినక్రమమున దిద్దినతోడ
ప్రౌఢఁగావించి సౌభాగ్యనిరూఢ
గాఢయభీష్టభోగంబులఁ జెంది
కైలాససుందరకందరస్థలులఁ
గేళీవనీ వారి కేళీవనములఁ
గోలఁకులఁ గెలకులఁ గుంజపుంజముల
మెలఁగుచుఁ జెలగుచు మితిలేని వేడ్కఁ
గ్రీడావినోదభంగినటించియొక్క
నాఁడులీలార్థమైనవ్వులాలకును
పార్వతికోపంబు పరికించిదలవ
శర్వుండు కేళికాసౌధంబులోనఁ

గాంతాకృతివహించి గంగాతరంగ
కాంతియు గంగయై కడుజెలగంగ
సరసతఁగ్రీడించు సమయంబునందు
ధరసుతచెలికత్తె థా మనజూచి
కొఱకొఱలాడుచుఁ గోపంబుతోడ
బలువిడిచనుదోయి బరువుననడుము
గడగడవణకంగఁగచభృంగపాళి
ముడివిడి యసుగుదమ్మోలమీఁదగవయ
వెక్కసంబగునూర్పు లిడి వణఁకడరఁ
జెక్కిళ్ళఁగ్రమ్మిన చెమ్మటతోఁడ
బిఱబిఱచనుదెంచి బెగడియాగౌరి
దఱిజేరి యప్పు డత్తరుణి యిట్లనియె.

క ఓయమ్మ యేమిజెప్పను
నీయధిపుఁడు కోపగాఁడై నిశ్శంకుండై
కాయజకేళీపరతం
బాయకయున్నాఁడు యొక్క బాలునితోడన్.

మ. అనినం గోమలిగుండె ఝల్లుమని హస్తాబ్జంబునం దున్న క్రొ
న్ననగుత్తింబడవైచి పల్కుచిలుకన్ సారించనుంద్రోచి యో
వనజాతేక్షణతోడఁగూడె పతి యో వామాక్షి! యింకేలనీ
వనుమానంబులుమానిదెల్పఁ గదవేయాద్యంతతద్వైఖరుల్.

వ. అనిన నచ్చెలికత్తె యదెభృంగి వచ్చుచున్నాఁడు వానినంత యుఁ దెలుసుకొందమని రావించి తద్వృత్తాంతంబంతయు నడిగిన భృంగి యిట్లనియె యమ్మా! నాకేల నే నేమి జెప్పిన వేళాకోళంబుయితోచుచు పరిహాసకుని తేలుబొడిచినటన్నసా మెత మీఱెరెఁగిన దేయన నబ్బోటినూటిమాటికి మఱియు నడిగిన నతండు కలహంబు పెంచదలంచి యిట్లనియె నీయమ్మ మాకు కన్నతల్లివంటిది గావున నున్నట్లు దెలుపవలసె మన ము నేటినుండికాదు బహుదినముల నాటినుండి యేటిరూపం బున నొక్కబోటినిశిరంబున నెక్కించుకొనియుంచికొనియె; నవి శైవాలకువల యాళిశంఖమృణాళకోకతరంగావర్త పులినమకరకమఠకమలంబులుగావు, కచనయనాపాంగకంఠ కరకుచవళినాభినితంబజంఘప్రపదపదంబులు. యీమర్మం బులు మీఁమదినుంచుటయే ధర్మంబుగాని బయలుపడిన మా కుండరాములు వచ్చురామలయిన నేమి సకలగుణాభి రాములు మీఱెఱుంగనిదేమి యనిన నబ్బోఁటియు మఱియు నడుగుచుండిన.

చ. అనవిని యట్టె యేమడిగెదంచుఁ జిరాకునలేచి పార్వతీ
వనితనితంబలంబికచవారము చేముడి గొల్పి యల్కచే
ఘనమణిభూషలూడ్చి నిసుకస్తురిపట్టియబెట్టి కోపగే
హనియతభూమశయ్యఁ దనరారె నిరంతరకంతువేదనన్.

గీ. పొటలు మసురసనుఁ గనుమూయ వెఱుఁగుజెందు
బెదరుపాన్పునఁబడు లేచు యొదఁగునవ్వ
కన్నగవనీరు నించు చీకాకునొందు
వాయుచలవలిసోలిక వడఁకుజెందు.

వ. ఇట్లు దురంతరవేదనంబొంది సోలి తెప్పిరిలి యయ్యొప్పులా
కుప్ప చిగురుటాకున విసరు కలవాణింజూచి యిట్లనియె.

ద్విపద.

అలివేణి! వినవమ్మ! యహహా! యీవింత
కలలోనెఱుంగము గదవెయోయమ్మ
నెఱపెటవేయగ నేరనివాఁడె
కురులుకొప్పున కొనఁగూడనివాఁడె
ధవుఁడన్న గురుఁడన్న దైవమటన్న
నవధనంబన్న నెన్నఁగదానెయనుచు
గట్టిగా బహుతపఃక్లాంతాత్మయగుచుఁ
జెట్టబట్టితినింత జేసుటనెఱుఁగ
గడిదైన నెడబాయగా లేనివాడు
కడుదుర్ఘటంబైన కల్కినామాట
కడుగుదాటనివాఁడు హా మహాదేవుఁ
డెడబాసిరాఁడు నేనెట్లోర్తునేఁడు
కలవాణి యెక్కడి గయ్యాళిగంగ

గలిగె నేనును నీళ్ళకన్నను మిగులఁ
బలచగాఁజూచెను ప్రాణనాథుండు
తలఁచెడిదెక్కడి తలయేరువచ్చె
నేఁటికి నామీఁద నెలఁతనాతోటి
యాటలు బాటలు నద్భుతచర్య
లన్నియుమఱపించె నామాయలాడి
యెన్నితెన్నులబడె నీకాపురంబు
కులగోత్రజన్మము కూల్యాత్మనన్నుఁ
జులకగాఁజేసి యిచ్చో నూతలేని
యెలనాగనెటు నెత్తినెక్కించుకొనెను
పలుబల్కులేల నాభాగ్యమిట్లుండె
నేమిసేయుదువిధి నేమందునమ్మ
యేమందులాడి పాలయ్యె నాభర్త
యక్కయీశుఁడులేని యైశ్వర్యమేల
చక్కదనంబేల జవ్వనంబేల
కటకటాయనిసోలి కన్నులవెంటఁ
బొటబొట నీర్గారఁ బొలఁతియిట్లనియె.

ఉ. కాంతుఁడురాఁడు మన్మథుఁడు కత్తికిరాతికిఁ దప్పనాఁడు బల్
పంతముజూపినాఁడు చెలిప్రాణముదక్కగనీఁడు నేఁడు క
ల్పాంతసహస్రకల్పకములయ్యెనిమేషము లక్కటక్కటా!
యెంతనిమోర్తు నేమగుదునెచ్చటికేగుదు నేమిసేయుదున్.

హాయపిరాగం—ఆటతాళము.

తాళలేనె వోయమ్మా - వాఁడేలరాఁడేవో కొమ్మ
బాల వానితోఁడి తెమ్మా - నాపాలకల్గి వేగరమ్మ తా॥ ౧
సామ్మలేలపుచ్చుకోరె - నాయమ్మ కానిదోఁడి తేరె
యమ్మలార వేగరారె - వానినమ్మరాదుమీరుబోరె తా॥ ౨
దానివలనుజిక్కినాఁడె - నీయానయింకవాఁడురాఁడె
మానినియిదిమాయలాఁడె-నాప్రాణేశుఁడగపడఁడేనే తా॥ 3

వ. అని కాంత నిరంతరదురంతకంతుశరదంతురితచింతాక్రాంతయగుచున్నం గని కలవాణి కన్నీరునించుచు నిట్లనియె.

ద్విపద.

ఇంతిరో నీకేల యింతదురంత
చింతలు నావంటి చెలికత్తెగలుగ
శతపత్రనేత్రి నీసన్నిధిజేరి
పతిబతిమాలించు పంతంబుమీర
శ్రీరమావాణీ శచీ రతిముఖ్య
నారీమణులకెల్ల నాథులఁగూర్పఁ
జెలిమికత్తెలె కారె చిన్నినాతల్లి
సెలవీయుమిపుడు నీచిత్తమువచ్చు
నని వేగ నీశునియంతికమునకుఁ
జనిమ్రొక్కి శర్వుండుసన్న చేబిలిచి
మంతనంబునమరి వార్తలడుగ

వింతభావముదోఁచ వెలఁదుకనవ్వి
కాంతకు నేజెలికత్తెనై యుండి
యంతరంగపు మాట లర్థానూదెలుప
నావినిగంగాంగనాభినివేళ
మావినీలకచయేమైన విన్నదియొ
యని హరుడడుగ నోయయ్య నింకేల
ననుచు మాగౌరియు నన్నియు వినిమోఁ
జేరిక నను దయసేయుదుగాని
గౌరిజూడకయుండఁగా వచ్చినాను
శివ యింకదాపేల చెప్పెదవినుము
ధవళాక్షినదివేరె తలఁపుచేసినది
నగజాతతోడ నేనమ్మికల్ జేసి
తెగదెంపులుగ నుండితిమి మేము దేవ
చింతనేనెందుకై సేయ నావెనుక
వంతచే మనకలవాణియునైనఁ
దెలుపదామెనని నిందింతువటంచు
బలికితినేకాంత భావంబుచేత
ననిన చిత్తము ఝల్లుమనఁ దల్లడిల్లి
కననిది నాఁటి దాక్షాయణిగాదె
మనసెరుంగుదుమని మక్కువహరుఁడు
చనెపార్వతీకోపసదనంబుకరిగి.

క. వినయమున వచ్చుపతిఁగనుఁ
గొని శాలువముసుగువెట్టి కోమలియుండన్
మినుసిక దేవర యిట్లని
యెను మదనవిఘూర్ణమానహృదయాబ్జుండై.

ఉ. ఏటికిఁబల్కవే తరుణి నేలవసించెదు కోపమేటికే
పాటలగంధి యీకఠినభావము నాపయినెట్లుగల్గెనే
నేటికిఁ గొమ్మనావలన నేరముదెల్పవె ముద్దుగుమ్మ యే
నాఁటికియింత సేయఁదగునా తగునా సుగుణా మనోరమా.

సీ. అర్ధచంద్రుఁడు సమమైపోవుననుచునో
తిలకంబునుదుటిపై దిద్దవైతి
ననిచినతీవెదా నెనవచ్చునంచునో
బూనవుమైమణి భూషణములు
యధరారుణిమతక్కువై యుండుననుచునో
చెలువుగ విడియముల్ సేయవయితి
వలరుదమ్ములునాటివై దగుననుచునో
కన్నులు దెఱచి నన్గాంచవైతి

గీ. కోపమేటికి నామీఁదఁగువలయాక్షి
కరుణఁజూడవె యికనైన కమలనయన
చల మిఁదేటికి నాయందుఁ దలిరుబోణి
యెంతపగవాఁడనైతినే దంతిగమన.

మ. చలమేలే చెలిమేలె చెంగలువ నేజాపాదుశౌతమ్మిము
ల్దులదూలించెడు చూపువెన్నలలతళ్కుల్ నాపయింజల్లవే
కులుకుంగుబ్బలగాఁగిలించికొనవే కోర్కెల్దగందీర్పవే
యలివేణీ జలజాతపాణిరమణీ హా ! కీరవాణీమణీ.

వ. అనిన నబ్బోటి కినుకమనమున బెనఁగొన నిదురించుబాలాహి
తరుణుని మేలుకొలిపినట్లు నిట్టూర్పు నిగుడించి విరహావిదళ
నారుణితమదనాస్త్రంబుకోపుజూపుచూపునం చుఱచుఱం
జూచి యిట్లనియె.

ద్విపద.

ఔర! యెంతటివాఁడ వహహా! నీవెన్ని
నేరిచితివి మేలునీవెరా వల్గ
బొంకనేరవుచాలు పొమ్మేటిమాయ
లింకచాలించు మేమెఱుఁగుదుమింక
గంగాధరుండవు కాయజమర్మ
కర్మమే మెఱుఁగుదే కటకటా శైల
ధర్మమునీయందె దగుచు గిరీశ
పొందుగానాయింతి పొందుజాలించి
యిందేలవచ్చితి విదివృథకార్య
మీమాయ లీవగ లీతక్కులెల్ల
నాముందరను సాగునా? కుటిలాత్మ
పైనమృత స్వరూపంబుగల్పించు

లోనవిషంబుండె లోకమెఱుంగ
నినునమ్మియుండిన నెట్లుజేసితివి
కననయ్యె నీభావగరిమంబు నేఁడు
కైలాసమందర కందరస్థలులు
కేళీవినోదభంగి నటించుమింక
నీనేస్తకత్తెతో నీవు నిశ్చింత
నే నిదేక్షణములో నిన్నె మెప్పింతు
నగుపాటుగాకుండ నన్నుఁజూడుమనుచుఁ
దెగువజేసెడు మరిదిగ్గనలేవఁ
బరమేశ్వరుఁడు మదిభయమందియుఁకను
వెరపేమిలేదని వెలఁదికిమ్రొక్కె.

గీ. హీరమంజీర సితకాంత లెల్లదిశల
నలర నెలదాల్పుశిర మంతతొలఁగద్రోచె
వామపాదంబుచే గౌరికాముతలను
కొర్కెదగఁబాలవానలుగురిసెననఁగ॥

ఉ. అప్పుడు చంద్రమౌళి వినయంబుననిట్లను నల్కమానవే
యొఃప్పులకుప్ప నీదయకు యోగ్యుఁడగానటె యింకనైన నా
తప్పుక్షమింపు నీచరణతామరసంబున కాముగాయపుం
నొప్పులుదీరెభాగ్యములునూల్కొనెఁజల్కులకొల్కిమాకికన్.

క. కలకంఠకలనవీణా
కలకల కలఫణితిఖ్భుని కప్పెదుర నె యా
కలవాణి వగచె నశ్రులు
కొలుకొల దిగజారి గబ్బిగుబ్బలఁ జెందన్.

వ. అంతఁ బురాంతకుండు కన్నియఁ గౌగిలించుకొని కన్నీరుదుడిచె బాలా యీలీల నీకుంజాలిబడనేల నీవేలాగుజెప్పిన నాలాగు విందు ననియూరార్చి యంత కలకలంబాపి యభీష్ట భోగంబుల సుఖంబుండి కొంతదడవునకు శివసన్నిధి కరుగుదెంచు గంగంగని పార్వతి కోపంబుబట్టలేక యిట్లనియె.

శంకరాభరణరాగం — ఆటతాళము.

ఎక్కడవచ్చితీవే నాకాపురమునకిటునీళ్ళుపోయగను॥ ఎక్క॥
చక్కనాయలేవేసారస్యమేనీయక్కారమాకేటికే
అక్కఱలేదనిపొక్కతిరిగేవు నీవైతె బాటబట్టవె॥ ఎక్క॥
పెక్కులమాటలు మాను బాటపట్టవు నీపెట్టుబోతలదానవా
అదెమొన్నవచ్చి మురసేవునీకింత-యతిశయమెక్కడిదే॥ ఎ॥
వదరాకుచెండివై నీయతిశయ మేమిఃపల్కారతే
ముద్దురాలవుగనక మొగనినెత్తికెక్కిమురియుచునున్నావె॥ఎ॥
ముద్దులేనిచంక కెక్కఁదలంచి నేమొక్కించుకుంటినటె
కులగోత్రజన్మాదులవ్యభాగ్యముగల్గి మలరినదానవటె॥ఎ॥
కులజన్మములుశివుఁడుకోరెమొఱుఁగునునీవుకొండదానవుగావటె
జాలారిదాన యెక్కువలాడితేనేను సైఁచబోనుసుమీ

అక్కవాలాయముగనీవాడినపడియుండువా రెవరుదెల్పగదే
అలవాటయ్యెని నేనీళకన్నాను పలుచనై తినటవె॥ ఎ॥
పలుచనవాదువుపదికింపలోకులకు - భయంకారివగుశక్తివె
గంగానమ్మా నీవుగావటె దరిలేనికడిమినితిరిగెదవు॥ ఎ॥
గంగసొదుగాని నీలాగుతండ్రిని-గాదఁ పుట్టితినా
నీకొద్దిబని కేవు నీకేలనాజోలి - నిలువునీరుగాను॥ ఎ॥
చేకొని నీముద్దుకొండరాళ్ళపాటుగాశపోవునటవె
నాతోజగడాలాడనాతిరో యిటుకంకణములేగట్టినావటె॥ ఎ॥
నీతోటివాదించ నేనెంతదానను నీతోకలసియుందు.

రేగుప్తిరాగం—ఆదితాళము.

యువిదరోమనమిద్దర మొక్కటైతిమే వేడ్క
శివునితోఁ గేళిసలుపుచు మెలగుచుందామె
నలినశృంగారములనాఁడునాఁటికి
యెంతోవివిధభోగభాగ్యములవృద్ధిగంటిమిా॥ యు॥

ద్విపద.

బాలేందుధారియుఁ బార్వతిఁగూడి
చాలమోదంబున సౌఖ్యంబు జెంద
నొనరనంతటఁగుమారోదయమయ్యె
ఘనతారకాలిరాక్షసవథమయ్యె
సకలలోకమ్ములు సంతోషమందెఁ
బ్రకటకల్యాణపారంపర్యముగను

విజయనగరిని శ్రీవేంకటేశ్వరుల
ఋజుగతిఁగూడి సమృద్ధభాగ్యముల
మృత్యుంజయుండని మెఱసె భక్తాళి
కత్యంతఫలదాతయై జెలువొందె
శ్రీరమాపతిపేర శ్రీహరిపేర
నారాయణునిపేర నాస్వామిపేర
నత్యంతభక్తితో నంకితంబైన
మృత్యుంజయవిలాసమ్మను లనాటకము
హరికంకితంబౌట హరికథయగుట
హరిహరదాసహృద్యం బగుచుండు
నరసతనిక్కథ చదివినవిన్న
నరులకు నిహపరానందంబు దొరకు
వరపుత్రపౌత్రాభివైభవం బలరు
ధరణినాచంద్రార్క తారకముఁగాఁగ.

ద్విపద.

శ్రీసింహభూధర శ్రీరామతీర్థ
భాసురస్థలముఖ్య బహుదేశములకు
నాచార్యు లుభయవేదాంతరహస్య
ధీచతురాత్ములు తిరుమలవంశ
కలశాంబురాశిరాకాచాంద్రమూర్తి
సలలితుల్ పెద్దింటిసంపత్కుమార

శ్రీవేంకటార్య దేశికులశిష్యుఁడను
పావనగౌరమాంబాబుచ్చిమంత్రి
వరపుత్రుఁడనుసూర్యవరునిపౌత్రుఁడను
యిరవొందికాశిరామేశ్వరముఖ్య
సరసదివ్యక్షేత్ర సంచారభవ్య
కరులైన వెంకన్న కామన్న యనెడు
ననుజన్ములనుగూడి యలరినవాఁడ
శ్రీకూర్మదాసాఖ్య జెందినవాఁడ
నాకుఁదోఁచినయట్ల నన్యకావ్యంబు
రచియించిహరికి నర్పణ జేసినాడ
ప్రచురపాండిత్యసంభావితులార
గురుతరసత్కావ్యకోవిదులార
సరసతగుణ లేశకం బిందు నెంచి
కరుణచే నానందకరులుగావలయు.

మ. హరి నారాయణవాసుదేవపరమాత్మా కృష్ణగోవింద శ్రీ
ధరదామోదరపద్మలోచన ! ముకుందా భక్తసంరక్షణా
వరదా మాధవ శౌరిశేషశయనా వైకుంఠదీనార్తిసం
హరణా కేశవచక్రహస్తనరసింహా వైనతేయధ్వజా.

క. కమలాసనముఖవినుతా
కమలాంబకజనకధవళకమలాంబక శ్రీ
కమలామానసహంసా
కమలధరశరత్ప్రమోదకమలాప్రియశా.

ఉత్సాహవృత్తము.

వారణావనప్రమోదవైరిగర్వవారణా
చారణాదివంద్యపాదచారుధర్మచారణా
ధారణాదియోగరూఢతత్వరత్వధారణా
కారణాఢ్యకృత్తదైత్యకాండకేళికారణా.

౯. పరమభక్తిని గోకులపాటికూర్మ
మంత్రి మృత్యుంజయవిలాసమధురకావ్య
మొనరరచియించె సన్నిధినుండివ్రాసె
ధరణినాదుర్తిహరిహరదాసఘనుఁడు.

మ ం గ ళ హా ర తి.

గజలక్ష్మిజయనారాయణులకు జయమంగళము॥ అనుపల్లవి॥
సుయశస్సంపూర్ణులకు శుభమంగళం॥ జయలక్ష్మిజయ॥
వెలయసకలలోకములు - తలిదండ్రులరీతిబ్రోచె జలజాత
లోచనునకు॥ జయమంగళము॥
తలిరువిల్తునిగన్నయాదిదంపతులకు కారుణ్యలలితమూర్తు
లకిదెశుభమంగళము॥ జయమంగళం॥
పొందుభక్తులనెల్ల - పోషించెవైఖరి హరిచందనాత్ముల
కునిదె॥ జయమంగళం॥
వందనీయులకు జగదానందఘనభూరికా సుందరాంగుల
కు నిదె శుభమంగళం॥ జయలక్ష్మి॥

గజపతిసంరక్షులకు - విజయనగరదక్షులకు - దుష్టజనచిత్త విముఖులకు॥ జయమంగళం॥

భజనసేయుకూర్మవాసుపాలించె శ్రీదేవులకు - సుజనావన భవ్యులకు॥ శుభమంగళము॥

జయలక్ష్మి జయనారాయణులకు.

గద్య.

ఇది శ్రీమన్నారాయణచరణదాస్యపవిత్ర గోకులపాటి బుచ్చ
నామాత్యపుత్ర శ్రీ తిరుమల పెద్దింటి సంపత్కుమార
వేంకటాచార్య దేశికానుగ్రహసనాథ శ్రీకూర్మనాథ
ప్రణీతంబైన మృత్యుంజయవిలాసంబను శృంగార
నాటకగేయ ప్రబంధంబునందు, తృతీ
యాశ్వాసము - సంపూర్ణము.

మృత్యుంజయవిలాసము
సంపూర్ణము.

---

# ఆంధ్రవిజ్ఞాన సమితి,

## విజయనగరము.

**అధ్యక్షులు, కోశాధిపతులు :**

రావుసాహేబు వేపకొమ్మ జి. సుబ్బయ్యపంతులుగారు,

బి ఇ యం. ఐ. ఇ.,

చీఫ్ ఇంజనీయరు శ్రీ విజయనగరం ఎస్టేటు.

**ఉపాధ్యక్షులు :**

అడిదము రామారావు పంతులుగారు,

రిటైర్డు సీనియరు తెలుగు పండిట్, శ్రీ మహారాజావారి కాలేజి.

**కార్యదర్శి :**

గంటి సూర్యనారాయణశాస్త్రి,

**కృత్య సమాలోచన సమితి :**

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,

తాతా సుబ్బారాయశాస్త్రిగారు,

శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామిగారు, యం. ఏ.,

ప్రిన్సిపాల్ శ్రీ మహారాజావారి సంస్కృతకళాశాల.

శ్రీమాన్ టి. నరసింహాచార్యులుగారు, ఎం. ఏ. యల్. టి.,

లెక్చరర్ భాషాశాఖ శ్రీ మహారాజావారి కాలేజి.

డాక్టరు, బుర్రా శేషగిరిరావు పంతులుగారు,

యం. ఏ., పిహెచ్. డి.,

ఆకుండి వేంకటశాస్త్రిగారు,

పండితులు, శ్రీ మహారాజావారి సంస్కృతకళాశాల,

ఆంధ్రయూనివర్సిటి సెనెటు, ఎకమిడిక్కౌన్సిలు, బోర్డాఫ్ స్టడీసు సభ్యులు.

# సమితి యుద్దేశములు.



ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున నింతవరకెన్నియో యుద్గ్రంథములు వెలువడియున్నవి, వెలువడుచున్నవి. అవి యన్నియు ఆంధ్రవిజ్ఞానాభివృద్ధికి ఉపకారములగుచున్నను, ఆంధ్రవిజ్ఞానసరస్వతిని ఆంధ్రావనిలో సర్వతోముఖముగ ప్రవహింపజేయఁదలంచి, మేమీ "ఆంధ్రవిజ్ఞానసమితి"ని నెలకొల్పినారము.

ఇందు ప్రాచీనాధునిక సారస్వత, చారిత్రిక, నైతికాది సంబంధ బంధురములగు హృద్య గద్య పద్యగ్రంథములు, సంవత్సరమునకు నాలుగింటికి తక్కువగాకుండఁ బ్రచురించ నిశ్చయించితిమి.

శాస్త్ర సంబంధములగు ప్రాచీనగ్రంథములను, రసభరితములగు ప్రాచీన ప్రబంధరాజములను, అధునాతన కవిపుంగవులు, విద్వాంసులు, కళాభిజ్ఞులుమున్నగువారిచే రచియింపఁబడిన ప్రకృతోపయోగములైన గ్రంథరాజములను మాసమితికి పంపిన, వాటిని సవిమర్శముగ పరిశీలించి, ముద్రణార్హములగునేని వాటిని ముద్రించుటకు ప్రయత్నించెదము. ఇంతియెగాక, ముద్రితగ్రంథములవలన లభించినలాభములో కొంతపాలు తద్గ్రంథాధికారికి కోరినచో లభించగలదు.

సమితి యాదాయమంతయు, గ్రంథప్రచురణకు, గ్రంథకర్తలకు, ప్రాచీన గ్రంథసంపాదనకు వినియోగింపఁబడగలదు, గాన ఆంధ్ర భాషాభిమానులు, ఆంధ్ర భాషోద్ధారకులు, ఆంధ్ర విజ్ఞాన సంవర్ధకులగు ఆంధ్రమహాశయులు మాయీ సమితిలో పోషకులుగను, చందాదారులుగను, జేరి, మా యుద్యమమునకు చేయూత నొసంగి, మాకుతోడ్పడి భాషాభివృద్ధిని చేయుదురుగాక యని యాశించుచున్నారము.

---

## నిబంధనలు.

పోషకులు:— సంవత్సరమునకు 10- రూపాయిలు తక్కువగాకుండగ నిచ్చువారు యీసమితికి పోషకులుగ పరిగణింపబడుదురు. సమితినుండి వెలువడిన గ్రంథములన్నియు వినామూల్యముగ పొందగలరు.

చందాదారులు:— సంవత్సరమునకు 4- రూపాయిలు ముందుగా నిచ్చువారు చందాదారులుగ నుండగలరు. సమితివారే తపాలాఖర్చులను భరించి గ్రంథముల నందింపజేయుదురు.

చందా నిచ్చువారు తప్పక రశీదును పొందవలెను. చందాసొమ్ము అధ్యక్షునిపేరిట పంపవలెను. గ్రంథములు వి. పి. గా పంపబడవు.

చందాదారులుగా జేరని యితరులకు తపాలాఖర్చులుగాక గ్రంథము 1 రూపాయికి లభించగలదు.

---

## విక్రమసంవత్సరగ్రంథములు.

1. రాధామాధవసంవాదము:- వెలిదిండ్ల వెంకటపతిమహాకవి ఇందు రాధామాధవుల సరససంభాషణములు ఇంపు సొంపుగా వర్ణింపబడి యున్నవి. వెల రు ౧—౦—౦.

2. విస్మృతకళింగాంధ్రకవులు:- శ్రీ అడిదము రామారావు పంతులుగారు ఇంతవఱకు కవులచరిత్రకెక్కని కళింగదేశమునగల ప్రసిద్ధులగు 15 గురు కవులజీవితచరిత్రాంశములు వివరింపబడియున్నవి. రు ౧—౦—౦.

3. వాల్మీకిచరిత్రము:- రఘునాథభూపాలప్రణీతము, ఇందు ఆదికవియగు వాల్మీకిమహాముని చరిత్రము చక్కగా చెప్పబడినది. రు ౧—౦—౦

4. ధర్మజచరిత్రము:- { శ్రీవేపకొమ్మ గురు వెంకటసుబ్బయ్యప తులం,
శ్రీమతి ఆదిలక్ష్మమ్మగార్లచే సంకలితము.

గృహస్థాశ్రమము లో నుండి, దేవతోపాసన సత్ప్రవర్తనమూలమున మోక్షమును సాధించు మార్గమును దెల్పు పుణ్యగ్రంథము. రు ౧—౦—౦

5. రుక్మవతీపరిణయము:- రేకపల్లి సోమనాథకవి (అడిదము సూరకవికి సమకాలీనుడును, ప్రతిస్పర్థియు నైనవాడు)

ఇందు రుక్మవతికల్యాణమహోత్సవము వర్ణితము, చక్కని ప్రౌఢప్రబంధము. రు ౧—౦—౦

---

# వృషసంవత్సర గ్రంథములు.

6 మృత్యుంజయవిలాసము:- (యక్షగానము) ఇందు గౌరీకల్యాణము మనోహరముగ వర్ణితము (గోగులపాటి కూర్మనాథకవి కృతులు-ప్రథమభాగము.) రు ౧—౦—౦

7 లక్ష్మీనారాయణసంవాదము, సుందరీమణిశతకము, సింహాద్రినారసింహశతకము:- (కూర్మనాథ కవికృతుల ద్వితీయ భాగము) రు ౧—౦—౦

8. ద్వైతాద్వైతదర్శనములు:-(విద్యారణ్యకృతమునకు ఆంధ్రీకరణము) శ్రీ మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ సుబ్బారాయశాస్త్రిల వారిచే నాంధ్రీకృతము. రు ౧—౦—౦

9 బాలగోపాలవిలాసము (నీలాపరిణయము) ఒడ్డియకవి విరచితము రసవత్తరమగు ప్రాచీనప్రబంధము. రు ౧—౦—౦

10. తత్త్వసంగ్రహరామాయణము:- (బాలకాండము—ప్రథమభాగము) బ్రహ్మానందభారతీస్వాములవారి సంస్కృతగ్రంథమునకు ఆకుండి వెంకటకవి ఆంధ్రీకరణము. రు ౧—౦—౦

11. తత్త్వసంగ్రహరామాయణము:- (బాలకాండము—ద్వితీయభాగము) రు ౧—౦—౦